సాహిత్యలతా గ్రంథమాల

ప్రథమ ముద్రణ, నవంబరు '52

వెల : రూపాయి

~~సర్వ స్వామ్యములు [illegible]~~

సంపాదకులు :

శ్రీమతి మద్దినేని అమృతాదేవి

గుంటూరు.

శాస్త్రిశ్రీ ప్రెస్

గుంటూరు

# సూక్ష్మ సమీక్ష

★

యుద్ధకాలంలో అన్ని దేశాల ప్రభుత్వాలు తమ గూఢచారులను ప్రపంచముమీదికి విరివిగా వెదజల్లుతారు. వీరిలో కొందరు శాంతి సమయాలలో కూడ కొన్ని యేండ్ల పర్యంతము ఆయా దేశాలలో మామూలు పౌరుల వలె ఏదో వ్యాపారము చేసుకొంటూ నిత్యజీవితము గడుపుతూ స్వదేశాలకు వార్తలు అందచేస్తూ ఉంటారు. వారు ఉంటూవచ్చిన దేశాలలోని ఆచార వ్యవహారాలలోను, వేషభాషలలోను పూర్తిగా కలిసి మెలిసి సంచరించడము వల్ల వీరు గూఢచారులనే సందేహము ఎవరికీ కలగదు. కాని ఈగూఢచారులను గురించిన ఆచోకీలు తీయడానికి ఆయా దేశాల ప్రభుత్వాలు ఒక ప్రత్యేక శాఖను ఎంతో వ్యయంతో భరిస్తూ ఉంటవి. దీనినే "ఇంటలిజన్సు డిపార్టుమెంటు" అని వ్యవహరిస్తారు. ఈశాఖకు తోడుగా ఇంగ్లాండు దేశములోని స్కాట్లెండ్ యార్డు లాంటి అపరాధ పరిశోధక శాఖ ఒకటి కూడా సహాయభూతంగా పనిచేస్తూ ఉంటుంది. విదేశీయ గూఢచారులు వార్తలను సేకరించడము చాలా వింతగా ఉంటుంది. సామాన్యంగా సైనిక దళాలు సైనికోద్యోగులు దిగుతూ తిరుగుతూ ఉండే హోటళ్లలో ఏదో వ్యాపారస్థులవలె స్నేహము కలుపుకొని వారు మాటలాడుకొనే మాటలను ఏమీ సంబంధము లేనట్లుగానే పైకి కనబడుతూ జాగ్రత్తగా వింటారు. వారికి కావలసిన ముఖ్య విషయాలేవంటే - పటాలాల స్థావరాలు - ఏపటాలము ఎక్కడినుండి ఎక్కడికి నడుస్తున్నది - శత్రువుపట్ల ప్రజాబాహుళ్యముయొక్క మనఃపరివర్తన - విమానదాడి జరపడానికి అనుకూలమైన వాతావరణస్థితి - ఆయుధసామగ్రి తయారుచేసే ఫ్యాక్టరీల వివరాలు - ఇత్యాదులు ఎన్నో విషయాలు వాళ్లు బహు జాగ్రత్తగా సేకరించుకొంటారు. ప్రతి స్వల్ప విషయముకూడా ఇది అనవసరమని వీరు పోనీకుండా

స్వదేశీయ కార్యాలయానికి తెలియ జేస్తారు. అనవసరమని ఏయే విషయాలం సామాన్యులు భావిస్తూ ఉంటారో ముఖ్యముగా అటువంటివాటి ద్వారానే అత్యద్భుత రహస్యాలు దేశాలు దాటి వెళ్లిపోతూంటవి.

గూఢచారవృత్తి బహు అపాయకరమైనది. పట్టుబడిన గూఢచారికి మరణదండన తప్ప వేరే శిక్షలేదు. సామాన్యంగా ఆయా దేశాల ప్రభుత్వాలు కూడా తమ గూఢచారుల రక్షణకు పూనుకోవు. స్వీయదేశ సేవా తత్పరులైన వారనేకులు ఈవిధంగా తమ దేశము కోసము ప్రాణాలు అర్పించినవారున్నారు. వీరిలో కొందరు అందగత్తెలైన స్త్రీలుకూడా ఉన్నారు. MATAHARI అనే చిత్రాన్ని చాలామంది చూచి యుండవచ్చును.

ఇంగ్లండు, జర్మనీ, అమెరికా దేశాలు ఈ గూఢచార వృత్తిలో చాలా ముందంజ వేసినవి. స్వాతంత్ర్య సముపార్జనానంతరము మన దేశము కూడా ఈ విషయములో ఆదేశాలతోపాటు సమానస్థాయిలో తులదూగ గలసి యుంటుంది. నాజీ జర్మనీలో ప్రభుత్వశాఖలలోను సైనికదళాల్లోను పారిశ్రామిక రంగాల్లోను బ్రిటిషువారి ప్రతినిధు లుండేవారు జర్మనీ సైన్యములో కమీషను ఆఫీసరు పదవులు నిర్వహించినవారు కూడా ఉన్నారు.

ప్రతిభాసంపత్తిలో బ్రిటిషువారి రహస్యశాఖ చాలా అద్వితీయమైన దనే చెప్పాలి. వారి ప్రతినిధులను మొత్తముమీద జర్మనీ దేశమంతటా నియమించడమే కాకుండా ఇంగ్లండు దేశంలో ఉన్న జర్మనీ గూఢచారులను వెన్నాడి పట్టుకొని వారిద్వారా ముఖ్యవార్తలు దేశము దాటి పోనీయకుండా అరికట్టడానికి నిపుణులైనవారితో మరియొక శాఖనుకూడా అతి సమర్థతతో నిర్వహించారు. అయితే జర్మనీదేశపు ఇంటెలిజన్సు సర్వీసు శాఖవారు కూడా బ్రిటిషువారికి ఎంతమాత్రము తీసి పోయేవారుకారు. సమాన ప్రజ్ఞలతోను సమాన చాకచక్యములతోను వారు ఒకరికొకరు నడపిన చర్యలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించగలవు.

యుద్ధకాలంలోనేకాక శాంతి సమయాల్లో కూడా గూఢచర్య సాగుతూనే ఉంటుంది. కాని ఆ దృక్పథము మారుతుంది. యుద్ధానికి విరామం అనేది ఉన్నది కాని గూఢచర్యకు లేదు. శాంతి సమయాలలో వర్తకపు

ఒడంబడికలు - దేశహితార్థమై ముఖ్యంగా కావలసిన ముడిపదార్థ సముదాయము - నూనె, జనుము, యురేనియమ్ ఉత్పత్తి కేంద్రాలపై అధికారము - రవాణా సౌకర్యములు - మొదలగువాని విషయమై గూఢచారులు వేగు పంపుతూ ఉంటారు. ఇవిగాక బలంగల రాజ్యాలమధ్య వివాదగ్రస్త విషయాల్లో తంత్రము నడిపేనిమిత్తము కూడా అన్ని దేశాల గూఢచారులు నిమగ్నులై యుంటారు.

వివిధదేశాల ప్రముఖ రాజకీయవేత్తల సమావేశాల్లో గూఢచారులెందరో గుమిగూడుతారు. మిత్రమండలిగా సమావేశమైన వారి ఆలోచనలు - నిర్ణయాలు - శత్రువర్గాలవారికి తెలియనీయకుండా ఆగూఢచారులను అన్వేషించే నిమిత్తము పరిశోధకశాఖవారుకూడా వెంబడే ఉంటారు. ఒక దేశముయొక్క విదేశీయ రాజ్యాంగనీతి తమ రహస్య ప్రతినిధులద్వారా తెలిసిన అంతరంగిక సమాచారాలపై ఆధారపడి ఉంటుంది. సంధిషరతులు రాయబారాలు ఒడంబడికలు తెగతెంపులు గూఢచారుల రహస్య నివేదికలను బట్టే అమలుజరుపబడుతవి

బ్రిటిషువారి రహస్యశాఖ యుద్ధకాలంలోనే కాకుండా యిప్పుడు కూడా అప్రమత్తతతో వ్యవహరిస్తూ ఉంటుంది. వారి ప్రతినిధులు అన్ని దేశాలలోను ఉన్నారు. విదేశరాజ్యాంగనీతి సమర్థతతో నిర్వహించాలంటే స్వాతంత్ర్యం సంపాదించిన మనదేశానికి కూడా ప్రతిభాసామర్థ్యాలతో కూడుకొన్న యిటువంటి శాఖ చాలా అవసరము. వారు మామూలు పద్ధతిలో ప్రభుత్వ ప్రకటనలద్వారా తెలిసే సమాచారాలు కాక అతి రహస్యవిషయాలు తెలిసికొని విదేశాలలో ఉన్న మన కార్యాలయాలకు తెలియజేస్తూ. ఉండాలి. భారతదేశ పరిపాలనలో ప్రాచీనకాలంనుంచీ వేగులవారి ప్రసక్తి ఉన్నది.

ఇందులో వివరింపబడినవి క్రీ. శ. 1939 - 45 పర్యంతము ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామ కాలంలో జరిగినటువంటి సంఘటనలు. బ్రిటిషు వారి రహస్యశాఖలో పనిచేసిన బెర్నార్డు న్యూమన్, ఈ. ఫ్రిక్రిడ్జి గూఢచారుల గాధలను గ్రంథస్థము చేశారు. చాలా నవలలు కూడా వ్రాశారు.

కొన్ని ఆంగ్లపత్రికలుకూడా ఈ విషయములను ప్రకటించినవి. మన భాషలో ఇంతవరకు ఇటువంటి రచనలు వెలువడి యుండలేదు. వీనిలో కథ కావలసిన ముఖ్యాంగాలు చాలావరకు లోపించినట్లు పాఠకుల దృష్టికి కనిపించవచ్చు. కాని యథార్థ వార్తాశ్రవణములో వారు పొందే ఔత్సుక్యములోను, ఆనందములోను, వానివల్లకలిగే విజ్ఞానములోను ఎంతమాత్రమూ కొఱవడిలేవు.

వీనిలో వ్యక్తులపేర్లు, కొన్ని ప్రదేశాల పేర్లు మార్చివేయబడినవి. అందువల్ల విషయ వివరణములోను కథా సంవిధానములోనూ ఏమీ లోటు వాటిల్లదు.

ఈ గ్రంథము ఆంధ్ర ప్రజానీకముయొక్క ఆదరాభిమానాలను చూరగొన గలదని ఆశిస్తున్నాను.

గుంటూరు,
21-9-52.

కొమరవోలు నాగభూషణరావు
సాహితీ సమితి.

# 1

అది 1944 వ సంవత్సరము. 1940 వ సంవత్సరంలో ఫ్రాన్సు పతనము కావడముమూలాన మిత్రమండలివారి అమూల్యములైన రహస్యములు శత్రువులవశమై పోయినవి. అప్పట్లో రేడియో యంత్ర సామగ్రి విషయంలో జర్మనీవారికన్నా ఎన్నోరెట్లు ముందంజవేసి విమానదాడులు జరపడానికి తయారయ్యే సమయంలో తలవనితలంపుగా మిన్ను విరిగి మీదపడినట్లు ఒక్కుమ్మడిగా శత్రుసేనాప్రవాహం మిత్రమండలిపై పడినందువల్ల కీలకప్రాయమైన సామగ్రి శత్రు హస్తగతమై పోయింది. వారు దానిని జాగ్రత్తగా తీసి పరిశీలనార్థము శాస్త్రవేత్తలకు పంపించి వేశారు. జర్మనీవారు తమ స్వంతసామగ్రిని వినియోగిస్తూ అక్కడక్కడ కొన్ని రేడియోస్టేషనులను నెలకొల్పుకున్నారు. పట్టుబడిన మిత్రమండలి స్టేషనులనుగూడా తమ ఉపయోగంలోకి తెచ్చుకున్నారు. ఆ పరిస్థితులలో ఉండగా 'కేలే' నగరానికి దక్షిణంగా సముద్రతీరానికి రెండు మైళ్ల దూరంలో ఉన్న గ్రామంలో కొంతమంది సైనికోద్యోగులు యుద్ధకార్యాలలో ప్రమత్తులై యున్నారు. అ గ్రామానికి దగ్గరలో ఒక చిన్నకొండ ఉన్నది. ఆ కొండమీద ఒక రేడియో స్తంభము ఉన్నది.

అక్కడున్న సైనికోద్యోగీయులలో కొంతమంది ఫ్రెంచివారు. వారితో 'ఎడ్వర్డు', 'మారియట్' చాలా దోస్తీగా తిరిగేవారు. వీరి వెంబడి జర్మన్ దేశీయ డొకడుకూడా తిరు

గుతూండేవాడు. ఆ జర్మన్ దేశీయుడు చాలా మర్యాదగా ప్రవర్తించేవాడు. ఎంతో చక్కగా ఫ్రెంచి మాట్లాడేవాడు. అతని మాటలలో చక్కని లాలిత్యమూ, కిలకిల లాడించే హాస్యమూ, ఇమిడియుండేవి. మొదట్లో అతన్ని ఈ మిత్రు లిరువురు దగ్గరకు జేరనీయకపోయినా, కాలక్రమేణ అతనిలో ఉన్న ఆకర్షణశక్తిని నిరోధించలేకపోయినారు. ఆ జర్మన్ దేశీయుడు ఎప్పుడూ యుద్ధం విషయముగానీ, హిట్లర్ విషయం గాని, యేమీ మాట్లాడేవాడు కాదు. ఆ ప్రసక్తే లేదు అతనికి. ఎప్పుడన్నా చెప్పితే జర్మనీలోఉన్న తన భార్యాబిడ్డలను గురించి విచారము వెలిబుచ్చుతుండేవాడు.

## కేలే నగరంలో జర్మన్ గూఢచారి

ఒకనాటి సాయంకాలము వారు ముగ్గురూ కూర్చొని కాఫీత్రాగుతుండగా "మార్శల్ లాడో" అక్కడికి వచ్చాడు. లాడో ఫ్రాంసు ప్రభుత్వోద్యోగి. అజ్ఞాతంలోకి పోయినవారిని అన్వేషించే శాఖలో ఒక నాయకుడు. వీరికి దగ్గర బంధువు కూడాను.

అతడు అప్పుడే వెళ్ళిపోయి, మరునాడు ఆ జర్మన్ దేశీయుడు వారివద్ద లేనప్పుడు వచ్చి యిలా అన్నాడు:—

"నేను నిన్న సాయంకాలము ఇక్కడ చూచిన విషయము నా కేమి నచ్చలేదు. ప్రస్తుతము జర్మనీవారిని చూస్తూ ఊరుకోవలసిందేగాని, వారితో స్నేహముమాత్రం తలపెట్టగూడదు. మనము వారియందు గల అసహ్యతను వ్యక్తిపరచాలి. ఎక్కడకుపోయినా ఏవగింపు, అసహ్యాన్ని పొందడానికంటె మరివేరే నరకమక్కరలేదు."

ఎడ్వర్డు లాడ్డోకేసి చూసి

"అతడు మామూలు జర్మన్ సైనికుడుగాడు. ఎన్నడూ యుద్ధముచేయలేదు. అతడెప్పుడూ తాను ఇదివరకు యూని వర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేసిన సంగతులు, కుటుంబ వ్యవహారాలు మాటలాడుతాడు గాని తదితర జోక్యమేమీ అతనికి పట్టదు." అన్నాడు.

మార్షల్ లాడ్డో ఎడ్వర్డు మాటలు ఒప్పుకోలేదు.

"ఏమైనా గాని—ఇది నాకెంతమాత్రము ఇష్టములేదు. ఇది యొక జర్మన్ ఎత్తు. ఐతే అతనికి ఇక్కడ యేమి పని ! ఏమి చేస్తూంటాడు ?"

"నాకు తెలియదు. రోజుకు నాలుగైదుసార్లు ఆ కొండ మీది గుడిసెలోకి బోయి వస్తూంటాడు. కొంచెముసేపు సోల్జర్లతో ఉంటాడు. తరువాత వాళ్ల సాంగత్యము మొరటురకంగా ఉంటుందని మా దగ్గరకు వస్తూంటాడు."

"అబ్బాయి ! యిందులో ఏదో మోసము ఉన్నది. జర్మనీవా డెప్పుడూ ఈవిధంగా ప్రవర్తించడు." అన్నాడు.

ఫ్రెంచివారిది ఒకరకపు పెంకిమతము. వారు నమ్మినదే వేదము. ఎదుటివా డెంతచెప్పినా తలకెక్కదు.

మార్షలు లాడ్డో రహస్యోద్యమ శాఖలో ప్రభుత్వము వారి ప్రధానోద్యోగి అని దగ్గఱ బంధువులయినా ఆ ఫ్రెంచి సైనికోద్యోగీయులకు తెలియదు.

మార్షల్ లాడ్డో తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించినామని సంతృప్తిపడి అంతటితో ఊరుకోలేదు. వెంటనే యీ సంగతి తన ప్రధాన కార్యాలయంవారికి తెలియజేశాడు.

ఆ ఊళ్ళో 'పాల్' అనే ఫ్రెంచి స్కూల్‌మాస్టర్ కూడా ఒకనాడు వారితో యిలా అన్నాడు:—

"ఈ జర్మన్ దేశీయుడు సాధారణుడుగా కనబడడము లేదు. నాతోగూడ స్నేహము చెయ్యాలని ప్రయత్నించాడు గాని నేను దేశధర్మము చొప్పున అతనికేమీ సందివ్వలేదు. కాని—అనుమానం-లేదు. అతడు గొప్ప పండితుడైన మాట మాత్రం నిజము" అంటూ "ఆత డిక్కడ ఏమి పని చేస్తు న్నాడు?" అని ప్రశ్నించాడు.

అతడు ఆ కొండమీద ఉన్న రేడియోవార్తా స్తంభా నికి సంబంధించినవాడై యుంటాడని 'మారియట్' అన్నాడు.

ఈ సంభాషణ ఆ స్కూలు మాస్టరుకు ఇంతకు పూర్వమే కొంత అలజడిని కలిగించింది. ఆ అలజడిని మార్షల్ లాడ్ అన్నమాటలు మరింత రేపెట్టినవి.

"ఇది చాల స్వల్పవిషయమే. కాని, మొన్న వచ్చిన బ్రిటిష్ ఏజెంటు స్వల్పవిషయాలకే ఎక్కువ ప్రాధాన్యాన్ని యీయవలెనని చెప్పాడు."

"ఈ తీరము వెంబడేఉన్న రేడియో వార్తాస్తంభాలన్ని టికి ఒక్కొక్క ఉద్యోగిచొప్పున ఉన్నారా? నేనింతవరకు ఉన్నట్లు ఎక్కడా వినలేదు."

"సరే అలాగయితే అత డెప్పుడు ఆ గుడిసెలోనే యుండవలసి వుంటుంది. కాని క్రిందకు పైకి ఎన్ని పర్యాయ ములో రోజూ ఎక్కి దిగడం ఎందుకు?"

"లాడ్! మీ బంధువులిద్దర్నీ కాసేపు ఇంట్లో లేకుండ చేయగలవా?"

"ఓ! అదెంతసేపు. నేను రేపు మాయింటికి వాళ్ళను 'టీ'కి పిలుస్తాను. వాళ్లు చంక లెగరేసుకొంటూ వస్తారు"

## అధికారుల అనుమానం

తర్వాత రెండురోజులకు ఆ స్కూలుమాస్టరు, ఆయన స్నేహితుడూ మరొకడూ దొంగతనానికి బయలుదేరారు. ఎడ్వర్డు, మారియట్ కలసి మార్షల్ లాడ్గారి ఇంటికి వెళ్ళారు. ఈ జర్మన్ దేశీయుడు కొండమీది రేడియోస్టేషన్ గుడిసెలోకి వెళ్ళాడు. ఆ సమయంచూచుకొని పాలు, అతని స్నేహితుడు ఆ జర్మన్ దేశీయుని ఇంటిలో ప్రవేశించి, అతని సామానులన్నీ జాగ్రత్తగా పరిశీలించారు. ఆయనకు సామాను బహుతక్కువేగాని గ్రంథాలుమాత్రం నాల్గు బీరువాలనిండా ఉన్నవి. వాటిని పరిశీలించిచూస్తే, అవన్నీ నూతన పరిశోధనల గురించిన విజ్ఞానశాస్త్ర విషయక పుస్తకాలు. నిజంగా అతడొక యూనివర్సిటీలో ప్రొఫెసర్ గావచ్చు. ఆతని అభిమాన విషయము "ధ్వని" అని ఆ పుస్తకాలనుబట్టి తేలింది. అతడు ప్రొఫెసర్ గావడము, రేడియో పోస్టు అతనిచేతిలో ఉండడమూ, ఆయనదగ్గర "ధ్వని"ని గురించిన నూతన పరిశోధనలు గల పుస్తకాలు ఉండడమూ, ఇవన్నీ ఒకదాని కొకటి చక్కగా ఉన్నవి. కాని, పాలుకు అనుమానం తీరలేదు.

"నాకింకను సందేహము వదలలేదు. రాత్రి బ్రిటిష్ విమానాలు మనమీదుగా వెళ్ళినవి. "సైరన్" మీకు వినబడ లేదూ? ఆ రేడియోస్టేషన్ ఆఫీసర్ అప్పు డెక్కడ ఉన్నాడు? హాయిగా ఈ యింట్లో నిద్రపోతున్నాడు" అని ఎడ్వర్డు చెప్పాడు. "అతడు నిజంగా రేడియోస్టేషన్ ఆఫీసరయితే అట్లాంటి సమ

యంలో నిద్ర పోతాడా ? జర్మన్లు ఎప్పుడూ అట్లాచేయరు"
అని పాల్ అన్నాడు.

అప్పట్లో వాళ్ళకు ఏమి చెయ్యడానికి పాలుపోలేదు. ఒక సారి కొండమీదకు వెళ్లి ఆ రేడియో స్టేషన్ పెట్టిన గుడిసె లోకిపోయి చూస్తే సర్వమూ తెలిసిపోతుంది. కాని అది సాధ్యము గాదు. దానిచుట్టూ పెద్ద కాపలా, ముండ్ల తీగలూ, ఎన్నో ఆటంకాలు ఉన్నవి. ఆ ముండ్లతీగల మధ్యలో మందుగనులు కూడా ఉన్నవి. బలవంతముగా చొచ్చుకుపోవ డానికి వీలులేదు.

మూడు వారాలు గడిచాక ఒక నూతన విషయం తెలిసింది. దానిని ఎడ్వర్డే మోసుకువచ్చాడు.

జర్మనీ దేశీయునిపట్ల కలిగిన అనుమానాలు, అతని యింట్లో జరిపిన అన్వేషణలు ఎడ్వర్డుకు తెలియనీయలేదు. కారణం ఏమిటంటే, వాళ్లిద్దరూ ఎక్కువ స్నేహంగా కలసి తిరుగుతున్నారు కాబట్టి నోరుజారి ఎడ్వర్డు ఏమైనా బయటపెడ తాడేమోనని. కాని, ఎడ్వర్డుకు ఈ విషయం వేధిస్తూనేఉంది. అతడు ఒక రోజున సరాసరి మార్షల్ లాడో వద్దకు వచ్చాడు. వస్తూనే అతన్ని చూచి 'రాత్రి ఒక చిన్న విషయం జరిగింది. దానిఅర్థం యేమిటో తెలియడంలేదు' అన్నాడు.

"ఏమిటో చెప్పు ?"

"ఆ జర్మన్ ప్రొఫెసర్ మాతో మాట్లాడుతూ ఉన్నాడు. ఏదో యిదివరకు జరిగిన యుద్ధ విషయాలు చెప్పు తూంటే చాల శ్రద్ధగా వింటున్నాడు. ఇంతలో గడియారంకేసి చూచుకున్నాడు. వెంటనే గంతువేసి లేచి బయటికి పారి పోయినాడు. ఆ తొందరలో ఉక్కుటోపీ, గ్యాస్ ముసుకు

ఇక్కడే మరచిపోయినాడు. మేము వాకిటి దాకావెళ్లి అతని వంకనే చూచాము. అతడు పడుతూ లేస్తూ కొండమీద రేడియో స్టేషన్‌కు ఒక్కటే పరుగుతీశాడు."

## అధికారుల సమాలోచనలు

"అప్పుడు టైమెంతయింది ?"

" నేను గూడ అతనితోపాటు నా గడియారంవంక చూచాను. అప్పుడు గం 8-45 అయింది. కాని నా గడియారం ఆరు నిముషాలు వెనక్కు తిరుగుతుంది."

"అతడు తిరిగివచ్చిన తరువాత ఏమైనా చెప్పాడా ?"

"లేదు ఆతడు గంటపైదాక తిరిగి రానేలేదు."

మార్షల్ లాడ్‌కు ఇది యేమీ అర్థంకాలేదు. అజ్ఞాత నేరస్థుల పరిశోధన రక్షణాలయంలో అతడు నేర్చుకొన్న గూఢచర్య పాఠాల సారాంశము అతనికి బాగా జ్ఞాపకము ఉన్నది.

"మీకు తెలిసిన ప్రతి విషయము రిపోర్టు చేయండి. ఇన్‌టలిజన్స్ డిపార్ట్‌మెంట్ వారిపని క త్తి రిం పు బొమ్మల ముక్కల కూర్పు వంటిది. ఏ ముక్క తీసినా అర్థము లేనట్లు గానే కనబడుతుంది. కాని ఒకదానికొకటి కలుపుకొంటూ ఒక చట్రంలో బిగించేసరికి ఒక బొమ్మ యేర్పడుతుంది. మీకు అర్థంలేనిదిగా కనబడే విషయమే ఆ బొమ్మలో ఒక ముఖ్యాంగంగా పరిణమించ వచ్చును. ఇది వారికి నేర్పబడిన ముఖ్య పాఠము."

మూడురోజుల తర్వాత లండన్‌లో ఉన్న ఒక బ్రిటిష్ ఇన్‌టలిజన్స్ ఉద్యోగి ఒక రిపోర్టు చదివాడు. ఏమనగా 'కేలే'

దగ్గర ఒక రేడియోస్టేషన్ ఒక జర్మన్ ఫిజిక్సు ప్రొఫెసర్ ఛార్జిలో నున్నది. ఆతడుపోయి దానిని అప్పుడప్పుడు చూస్తూం టాడు. ఒకసారి రాత్రి 8-51 గంటలకు దాని దగ్గరకు పరు గెత్తుకొని వెళ్లాడు" అని.

## లండన్‌లో అనుమానం

ఇది అంత ముఖ్యమైన విషయంగా ఎవరికి కనబడడం లేదు.

ఇన్‌టలిజెన్సు ఉద్యోగులకు మాత్రము అట్లా కాదు. వారు దేనిని ఉపేక్షించరు. స్వల్పవిషయాలే గొప్ప విషయా లకు దారితీస్తవి.

వినగానే ఈ విషయంలో మనస్సుకు తట్టే దేమిటంటే ఆ జర్మన్ ప్రొఫెసర్ తొమ్మిది గంటలకు వార్తలు వింటానికి రేడియో స్టేషన్‌కు పరుగెత్తి ఉంటాడు. రేడియో ద్వారా రహస్య వార్తలు చెప్పడానికి వీలులేదుగదా! అదికాక ఫిజిక్సు ప్రొఫెసరును తీసుకొనివచ్చి గూఢచారిగా పెట్టుకుంటారా !

ఆ ఇన్‌టెలిజన్సు ఉద్యోగికి ఇంకోసంగతి తోచింది. విజ్ఞానశాస్త్ర విషయాలు అంతర్జాతీయములు. పరిశోధకులు ప్రపంచ దృష్టి నంతటినీ ఆకర్షింప గలిగినవారు. కాబట్టి ఆ జర్మన్ ప్రొఫెసర్ అడుగుజాడలలో పరిశోధనలు చేస్తూన్న బ్రిటిష్ వైజ్ఞానికుడు ఎవడో ఒకడు ఉండవచ్చును.

గంటలమీద ఇంగ్లాండును గాలించి పారవేశారు. బ్రిస్టల్ యూనివర్సిటీలో ఆ జర్మన్ ప్రొఫెసర్‌తోబాటు ఒక సంవత్సరము పని జేసిన ఒక బ్రిటిష్ ప్రొఫెసర్ కనబడ్డాడు.

"వైజ్ఞానికవిషయాలలో అతనికి ప్రత్యేకమైన అభిమాన విషయం యేమిటి?" అని ఆ బ్రిటిష్ ప్రొఫెసరును విచారించారు.

"అతను ఒక ప్రత్యేక విషయంలో చాల కృషిచేశాడు. 1936 వ సం॥ లో వైజ్ఞానిక సమావేశంలో ఆయన ఒక వ్యాసం చదివాడు. అది యేమిటంటే "వాతావరణమునుబట్టి ధ్వని యేరీతిగా మారుతుంది?" అని. ఈవిషయంమీద ఆయన చాల పరిశోధనలు చేశాడు. వివిధ వాతావరణములలో వివిధ రీతులుగా ధ్వని వినబడటంగురించి కొన్ని అపూర్వ విషయాలు ఆయన చాల బాగా చెప్పాడు. ఇంతకూ ఆయన యేమి చేశాడూ?" అని.

## ఇన్ టెలిజెన్స్ ఉద్యోగి కథనం

ఆ ప్రొఫెసరుయొక్క సమర్థతను గుర్తించి ఆ ఇన్ టలిజెన్స్ ఉద్యోగి విషయం యావత్తు పూసగుచ్చినట్లు చెప్పాడు.

"మంచిది ఈ పాళంగా నే నేమీ చెప్పలేనుగాని బాగా ఆలోచించి చెప్పుతాను. మనమిపుడు చేయవలసిన దేమిటంటే."—

ఇన్ టలిజెన్స్ ఉద్యోగి బ్రిటిషు ప్రొఫెసర్ సహకారానికి చాల సంతోషపడి వెంటనే మార్షల్ లాడ్జోకు కొన్ని సంగతులు కనుక్కొని వెంటనే తెలియచేయమన్నాడు.

మార్షల్ లాడ్జోకు ఈ సంగతులు కనుక్కోవడం ఎక్కువ కష్ట మనిపించలేదు. రెండవ రోజుకల్లా అతని దగ్గరనుంచి సమాధానం వచ్చింది.

ఇంగ్లాండులోని ఇన్ టలిజెన్స్ ఉద్యోగి వెంటనే బ్రిష్టల్

లో ఉన్న ప్రొఫెసరువద్దకు వెళ్ళాడు.

"ఇదిగో! మీకు కావలసిన సామగ్రి తీసుకొనివచ్చాను. ఆ జర్మన్ ప్రొఫెసర్ కొండమీది రేడియో స్టేషన్‌వద్దకు వెళ్ళే సమయాలు గంటలతో సహా—"

"ఓహో! నే నిదివరకే అనుకున్నాను. ఇదిగో చూడండి! వార్తా పత్రికల ప్రకారము వేళలన్నీ లండనులో ఉన్న బిగ్‌బెన్ గంటలు కొట్టే సమయాలకు సరిపోతూ ఉన్నవి. ఇప్పుడు తెలుస్తూఉన్నది. ఇక ఊహించడముగాదు. లెక్కలు కట్టవలసిన సమయము వచ్చింది. ఇది యొక బ్రహ్మాండమైన విషయమే కావచ్చు. మనము చర్య తీసికొనబోయే ముందు దీనిని రూఢిచేసికొని సిద్ధాంతీకరించాలి."

"ఎట్లాగో చెప్పండి?"

"మీ రొక పని చేయండి. పటాలముల కోసమని ఇది వరకు అమలులో లేని గంటకు అనగా సాయంకాలం నాల్గు గంటలకు బిగ్‌బెన్ గడియారము గంటలు కొడుతూందని ప్రోగ్రాములో వేయించండి. అప్పుడు మన జర్మన్ ప్రొఫెసర్ ఆ వేళప్పుడుగూడ కొండమీది రేడియోస్టేషన్‌కు పరుగెత్తుతాడేమో మనవాళ్లను కనిపెట్టి రిపోర్టు చేయమనండి."

ఆ జర్మన్ ప్రొఫెసర్ అనుకున్నప్రకారము సాయంకాలం నాల్గుగంటలవేళగూడ రేడియో స్టేషన్‌కువెళ్ళడం ప్రారంభించాడు.

ఆ సమాచారం తెలిసేసరికి బ్రిస్టల్ ప్రొఫెసర్ గారి వద్దకు ముగ్గురు ఇన్‌టలిజెన్సు ఉద్యోగులు వచ్చారు. వారితో ప్రొఫెసర్ ఆ విషయాన్ని గురించి విశదీకరించి చెప్పాడు.

"నాకు తేలిన సారాంశము మీయెదుట చెప్తుతు

న్నాను. ఆ జర్మన్ ప్రొఫెసర్ తన పరిశోధనలలో బాగా ఆరి తేరినట్లున్నాడు. ఇతడు యుద్ధానికి పూర్వమే యీ పనికి నియోగింపబడి ఉంటాడు. ఆతనిదగ్గర వివిధ వాతావరణము లలో వివిధరీతులుగా వినిపించిన బిగ్ బెన్ గడియారపు గంటలు సమస్తమైన వివరాలతో రికార్డుచేయించి సంపాదించి యుంటాడు. యుద్ధములేని రోజుల్లో అది చాలా సులభంగానే జరిగియుండవచ్చును. కాబట్టి ఇప్పుడా రేడియోద్వారా బిగ్ బెన్ గడియారపు గంటలు ప్రతిరోజూ వింటున్నాడు. ధ్వని రీతులను పరిశీలించడానికి ఆయనదగ్గర ఒక యంత్రముఉండి ఉంటుంది. తర్వాత కొన్ని కొన్ని వాతావరణములను దాటి 'ధ్వని' ప్రయాణించడములో సూక్ష్మములయిన భేదము లున్నవి. అవి గడియారం గంటలమీాద పడే దెబ్బల వాల కొన్నిబట్టి వాటిని గ్రహించడానికి యేదోపంథా అతడు కని పెట్టినాడు. నేను ఏమిచెప్పబోతున్నానో మీాకు అర్థమవు తున్నదా?"

"తెలుస్తున్నది. బిగ్ బెన్ గడియారముకొట్టిన గంటల మూలకంగా లండన్‌లోఉన్న వాతావరణ పరిస్థితులు అతడు కనిపెడుతూ ఉన్నాడు. ఆతడు రోజుకు ఒక పన్నెండు పర్యాయ ములు కనిపెడుతూ ఆ రోజంతా ఉండే వాతావరణ పరిస్థితిని, దాని మార్పులను తెలుసుకొంటూ ఉన్నాడు."

"అవును, మరొక విషయము కూడా ఉన్నది. లండను లోని వాతావరణము ఒక్కటేకాదు. ఆ ధ్వని ప్రయాణించిన తెలిగునుబట్టి మధ్యలోఉన్న వాయుపీడన శక్తులనుకూడా తెలిసికొంటున్నాడు. తన లెక్కలనుబట్టి, తతిమ్మా వాతా వరణ కేంద్రములవారు ప్రకటించే అంకెలనుబట్టి, విమానాలకు

జతచేయబడిన యంత్రములనుబట్టి, దక్షిణ ఇంగ్లాండు దేశ ప్రాంతాలలో వీచే వాయువుల గమనముకూడా తెలిసికోగల్గుతున్నాడు, దేనికొరకు చేస్తున్నాడో చెప్పలేనుగాని, ఇందులో ఏదో మహోద్దేశ మున్నది.''

''అవును, కేవలం వాతావరణ పరిస్థితులమీద ఆధారపడిఉన్న ఒక మహత్తర విషయం.''

"నేనింకా ఊహించి చెప్పుతున్నాను. జర్మన్లు ఇప్పుడు రేడియోద్వారా నడిపే విమానాలు తయారుచేస్తూ ఉన్నారని మనం వింటున్నాము. మన నెత్తిన వేసిన ఈ 'రాకట్లను' చూడండి. దీనికంటే మించిన ఒక కొత్త పంథా పైలట్ లేని 'ప్లేను', దానినడక రేడియోద్వారాకాని, గిరాస్కోపుల ద్వారాగాని జరిపించడం, పోసిన పెట్రోలునుబట్టి దూరంనిర్ణయించడం ఇత్యాదులు ముఖ్యంగా వాతావరణ స్థితిగతుల మీద ఆధారపడియున్నవి. పైలట్ ఉన్నప్పుడు గాలి ఎటువీచినా ఫర్వాలేదుగాని, పైలట్ లేని విమానము గాలి తాకుడుకు 20 మైళ్ళు దాదాపు ఏదో ఒకవైపుకు నిర్ణీతమార్గానికి విరుద్ధంగా కొట్టుకొని పోవచ్చు. కాబట్టి, ఈ విషయము ఇంకా పరిశీలించవలసి యున్నది.''

ఆ మాట చెప్పినతర్వాత ప్రొఫెసర్ భోజనం ముగించాడో లేదోకాని, అప్పుడే బ్రిటిష్‌వారి 'గూఢచర్యశాఖ' గాఢమైనపనిలో నిమగ్నమైపోయింది. అప్పుడే జర్మనీ దేశంలో ఉన్న ఏజెంట్లు వార్తా సంగ్రహణానికి పూనుకున్నారు.

ఆ ప్రొఫెసరు లండను తన కారుమీదవచ్చి 'వెస్టు మినిష్టర్' వంతెన దాటుతూండగా అతనికి బిగ్ బెన్ కొట్టిన గంటలు గంభీరముగాను, స్పష్టముగాను వినబడినవి. అతడు

ఆలోచనా ప్రవాహంలో పడిపోయినాడు. ఎందరు ఏకమైనప్పటికీ, నిగ్రహించి నిలువగలననే ధైర్యాన్ని పురికొల్పుతూన్నది ఆ గడియారపు గోపురము.

*        *        *        *

1944 సంవత్సరం జూన్ 16 వ తేదీనాడు జర్మనీవారి భయంకర ఆయుధము పైలట్ లేని విమానం, లేదా ఎగిరే బాంబుతో మొట్ట మొదటి దాడి జరిపినట్లు బి. బి. సి. వార్త ప్రకటించింది. ఈ వార్తతోపాటు ఒక ప్రకటనకూడా జరిగింది. ఇకముందు జాగ్రత్తకు సంబంధించిన కారణాలవల్ల బిగ్ బెన్ గడియారము గంటలు యథాతథంగా బ్రాడ్ కాస్టు చేయబడవనీ, వాని ప్రత్యామ్నాయముగా గ్రామఫోన్ రికార్డుల ద్వారా గంటలు తెలియజేస్తారని ఆ ప్రకటనలో ఉంది.

ఆ విచిత్రమైన ప్రకటనలోని అంతరార్థమేమిటో తెలియక లక్షలాది ప్రజలు విస్తుపోయినారు. కాని, ఆ రహస్యము బ్రిస్టలులో ఉన్న ప్రొఫెసరుకు ఒక్కడికే ఆనాటికి తెలుసు.

## 2

రేడియోలో మాట్లాడే వారిమీదకూడా తనిఖీదారులుంటారు. 'ఉన్నది ఉన్నట్లుగా చదువు. తేడా వచ్చిందంటే బందుచేస్తాను' అని ఉపన్యాసకుని తీక్ష్ణంగా హెచ్చరించి, ఆ ఉపన్యాసము నమూనా ఒకటి ఒక చేత్తో పట్టుకొని, ప్రతి అక్షరము పరిశీలిస్తూ, రెండో చేతిని స్విచ్చి బోర్డుమీద పెట్టుకొని సిద్ధంగా ఉంటాడు ఆ రేడియో స్టేషనులో ఉన్న అధికారి.

దీనినిచూస్తే చాలా చీదర పుడుతుంది, కాని యుద్ధ సమయాలలో యీ జాగ్రత ఎందుచేత అవసరమో ఈ కథలో తెలుస్తుంది. ఈ కథ జర్మనీ దేశస్థుడైన హెన్రీ అనే వానిని గురించినది. ఇందులో గూఢచారి చర్యలపైన గూఢచారము జరిపే ఒక క్రొత్త విధానము వివరింపబడినది.

ఇందులో భయంకర స్వరూపులుగాని, సౌందర్య వతులైన గూఢచారిణులుగాని కథా చమత్కారముగాని-ఇటువంటి వేవీ ఉండవు. కాని ఒక గూఢచారి ఏ తరహాగా తన పనిని నిర్వహిస్తాడో నిరూపిస్తుంది.

హెన్రీ అనేవాడు యుద్ధానికి సంవత్సరము పూర్వమే జర్మనీ దేశమునుండి వలసపోయిన నిర్భాగ్యులలో ఒకడు. అతడు ఒక మోస్తరు పేరుగల నటుడు. కొంచెము రేడియో పనికూడా తెలిసినవాడు. అతడు 1939 ఏప్రిల్ నెలలో ఫ్రాన్సు దేశములోకి తప్పించుకొని వచ్చాడు. జర్మనీ దేశము జెకోస్లోవాకియా ఆక్రమణ చేయడముతో యుద్ధము దగ్గరకు వచ్చిందనుకొన్నాడు. గెస్టపోవారి రహస్యాన్వేషణలు జాస్తి అయినవి. ఫ్రెంచి స్నేహితులున్నారని అతడు లిల్లీ వెళ్ళాడు. అక్కడ అంతర్జాతీయ రాజకీయ సమావేశాలకు కొన్నిటికి హాజరయినాడు. అక్కడ ఒక వర్గము అతన్ని దగ్గరకు చేరదీసింది. కొన్ని నెలలపాటు నూలు ఫ్యాక్టరీ మరలను తయారుచేసే పారిశ్రామిక సంస్థలో గుమాస్తాగా పనిచేస్తూ కాలము వెళ్ళబుచ్చాడు.

యుద్ధము ప్రారంభము కాగానే ఫ్రెంచి పోలీసులు ఇతన్ని అనుమానాస్పదునిగా నిర్ణయించారు. సహజంగా అతడు జర్మను దేశీయుడనే కారణము ఒకటి కనబడుతూనేఉన్నది.

అయినప్పటికీ కొత్తగా ప్యారిసు నగరంలో యేర్పడిన రాజకీయ సిద్ధాంత ప్రచారశాఖలో బ్రాడ్ కాస్టరు ఉద్యోగానికి అర్జీ పెట్టుకొన్నాడు.

అతని కా ఉద్యోగము ఎప్పుడు దొరుకుతుందా అని హెన్రీ చాలా ఆదుర్దాగా కనిపెట్టుకొని ఉన్నాడు. ఈలోపుగా రేడియోలో బ్రాడ్ కాస్టు చేయడానికి చాలా ఉపన్యాసాలు తయారుచేసి పెట్టుకొన్నాడు. ఆ ఉపన్యాసాలు జర్మనీ లో అప్పటి కింకా మిగిలిఉన్న ప్రజా ప్రభుత్వ పక్షమువారికి ఉద్దేశింపబడినవి. వాని సారాంశము ఏమిటంటే హిట్లరిజము నాశముచేయడానికి తోడ్పడండి అని.

అతని రచనలు చాలా బాగున్నవి. రేడియో స్టేషను డైరెక్టరుకు అతడునచ్చాడు. పైగా అతనికి స్వాభావికంగా బ్రాడు కాస్టు చేయడానికి తగిన కంఠ స్వరముకూడా ఉన్నది.

హెన్రీ ఉపన్యాసాలకు జర్మనీలో సంచలనము కలిగింది. నాజీలు హెన్రీ పేరుచెప్పి దేశద్రోహి అని పండ్లు కొరుకుతున్నారు. అతని ఉపన్యాసాలు తమ దేశంలో వినబడకుండా చేయాలని చాలా ప్రయత్నించారు.

## ఫ్రాన్సు దేశ సేవ

నిజానికి, జర్మనీకి విలియమ్ జాయిస్ (లార్డు హాహా అతనికి మారుపేరు) ఎటువంటి సేవచేశాడో హెన్రీకూడా ఫ్రాన్సుకు అటువంటి సేవే చేశాడు.

ఫ్రాన్సు పతనానంతరము అతడు మాయమైనాడు. రెండు పర్యాయములు 1940 జూలై 2 వ తేదీన ఒకసారి, ఆగస్టు 23 వ తేదీన రెండోసారి హెన్రీని పట్టుకోవడానికి గెస్ట

పోకు సాధ్యము కానందుకు చింతిస్తూ ఉన్నామని జర్మన్ రేడియో ప్రకటించింది.

1941 మే నెలలో ఒక రాత్రివేళ దక్షిణ ఇంగ్లాండు సముద్రతీరపు ఒక చిన్న రేవుకు ఒక చేపలపడవ చేరుకొన్నది. ఫ్రీ ఫ్రెంచి నౌకాదళములో చేరదలచుకొన్న పదునలుగురు బ్రిటను దేశీయులుకూడా అందులో ఉన్నారు. హెన్రీ వారిలో ఒకడు.

అతని వాలకము చాలా చికాకుగా ఉన్నది. నిద్రాహారాలు లేకుండా ఎడతెగనిపనీ, ఆదుర్దాలలో ముఖమంతా పీక్కొని పోయినట్లుంది. అతడట్లా ఉండడానికి తగిన కారణాలు కనబడుతూనే ఉన్నవి. వారాల పర్యంతముగా దాక్కొని ఉండడమూ, పట్టుబడితే భయంకరమయిన శిక్ష. అందును గురించిన భయమూ, ఆదుర్దా.

ఆ పదునలుగురు నావికులతో కలిసి హెన్రీకూడా జాగ్రత్తగా ఇంగ్లాండు దేశంలోకి ప్రవేశించాడు. యుద్ధము ప్రారంభమైన తరువాత అనేక వేలమంది కాందిశీకులు బ్రిటను చేరుకొన్నారు. వారితోపాటు కొందరు జర్మనీ ఏజంట్లు కూడా దేశంలోకి చొరబడి రావడము పెద్ద కష్టమైన పని కాదు. ఈ మాదిరి వచ్చేవారి మూలాన కూడా కొంత ఉపయోగము లేకపోలేదు. డన్కర్క్ సంఘటన జరిగినప్పుడు ఫ్రెంచి, డచ్చి, బెల్జియమ్ దేశాల పోలీసు ఆఫీసరులు కూడా కాందిశీకులలో ఉన్నారు. కాని వారు తమ దేశీయుల చర్యలను పరీక్షించడములో బ్రిటనుకు అద్భుతమైన సేవ చేశారు.

హెన్రీ రికార్డు చాలా బాగా ఉన్నది. అతనిని ఇదివరకు కలుసుకొన్నవారు, అతని ఉపన్యాసాలు ఆసక్తితో విన్నవారు

బ్రిటనులో అనేకులు ఉన్నారు. బి.బి.సి. యుద్ధవార్తల సమీక్షా శాఖలో హెన్రీ ఫ్రాన్సులో చేసిన ఉపన్యాసాల రికార్డులు ఉన్నవి. ఒకసారి ఎప్పుడైతే అతని వ్యక్తిత్వము గుర్తింపబడిందో మళ్ళీ మారుమాట లేకుండా అతనికి స్థానము దొరికింది.

## గ్రంథకర్తగా హెన్రీ

హెన్రీ మొదటి ఉద్దేశ్యము సైన్యంలో చేరవలెనని. కాని అతనికి తగిన పదవి లేక పోయింది. బి. బి. సి.లో ఉన్న జర్మను బ్రాడ్ కాస్టరులలో కూడా మంచి సిబ్బంది ఉన్నది. కాబట్టి అతనికి ఖాళీ దొరక లేదు. కొన్ని నెలలవరకు జర్మనీ భాషలో ఉన్న గ్రంథాలను ఇంగ్లీషులోకి అనువదించి పొట్ట బోసుకొన్నాడు. కొన్నాళ్లు ఒక ఫ్యాక్టరీలో పనిచేశాడు. చాలా పర్యాయములు బ్రాడుకాస్టు నిమిత్తము బి. బి. సి. కి రచనలు పంపించాడు. వానిలో కొన్ని నిజంగా ఉపయోగ పడినవి.

1942 సంవత్సరము పూర్తికావస్తుండగా క్రిస్మస్ పండుగకు కొన్నిదినాలకు పూర్వము స్కాట్లెండ్ యార్డ్ స్పెషలు శాఖవారు ఒక విచిత్రమైన విషయాన్ని కనిపెట్టారు. ఈశాఖ వారు గూఢచారులపైన గూఢచర్య జరుపుతూ ఉంటారు. ఆవు లించితే పేగులు లెక్కపెట్టడమనే జనవాక్యము వీరియందు అక్షరాలా చెల్లుబడి అవుతుంది. వీరికి యుద్ధశాఖలో ఒకవర్గము సూచనలు చేస్తూ ఉంటుంది. దాని నెంబరు ఎమ్. 1.5. స్కాట్లెండుయార్డువారి దృష్టి ఒక వర్తకుని మీదికి ప్రసరించింది. ఆవర్తకుడు జర్మనులకు సహాయకారిగా ఉన్నాడని అనుమానము కలిగింది. తనమీద అనుమానము కలిగినట్లుగా ఆవర్తకు

డికి తెలియదు. అతనికి తెలియకుండానే ఆతన్ని కనిపెట్టి ఉంచారు. అది సామాన్య కార్యముకాదు. ఆతడు ఎక్కడెక్కడకు వెళ్ళి, ఎవరెవరితో మాటలాడినాడో వారందరిని గురించి భోగట్టాలు చేయవలసి వచ్చింది. వారందరూ యథార్థంగా వ్యాపారస్థులే, ఒకరిద్దరు తప్ప. అతడు హెన్రీని గూడా కలుసుకొన్నాడు. హెన్రీతో అతడికి ఏమి పని ?

వారిద్దరూ యుద్ధానికి పూర్వము పరిచితులేమో !

ఇంటలిజెన్సు శాఖవారు అంతమాత్రంతో తృప్తిబడి ఊరుకొంటారా ? యాదృచ్ఛికమని దేనినీ వదలిపెట్టి ఊరుకోరు. హెన్రీ పూర్వచరిత్ర నిరాక్షేపణీయంగానే ఉన్నది. కాని, కొన్ని వివరాలు తెలియక పోయినా నమ్మకము మీద ఆధారపడ్డారు. ఉదాహరణకు – అతడు 1940 జూను మొదలు కొని 1941 మే నెల వరకు ఫ్రాన్సులో అజ్ఞాతవాసము చేశాడు.

కొన్ని నెలలకు పూర్వము పారిస్‌లో ఉన్న జర్మను జనరలు ఒకడు ఫ్రెంచి అధికారులకు ఒక ఫిర్యాదు చేశాడు. ఏమని – వాళ్ళు ఆలోచించుకొని తీర్మానించుకొన్న విషయాలన్నీ నలభైఎనిమది గంటలలోగానే లండనులో తెలిసిపోతూన్నవని. ఒక ఫ్రెంచిఅధికారి యిది ఒప్పుకోలేదు. నలభైఎనిమిది గంటలుకాదు, ఇరవైనాలుగు గంటలలోగానే తెలిసిపోతూన్నవని అతడన్నాడు.

## జర్మనుగూఢచారి

ఫ్రెంచివారి అజ్ఞాతవాసుల పరిశోధకశాఖ హెన్రీని చుట్టుముట్టి ఆచూకీలు తీశారు. వారిరిపోర్టు సందేహాలకు తావు ఇవ్వలేదు. హెన్రీకి జర్మనులకు సరాసరి ఏర్పడిఉన్న సంబంధా

లను కనుకొంటున్నారు. హెన్రీ నిస్సందేహంగా గొప్ప ప్రతిభ గల జర్మను గూఢచారి.

స్పెషలు బ్రాంచి ఇన్‌స్పెక్టరు మార్షలు రిపోర్టు చదవగానే బేడీలు చేతపుచ్చుకొన్నాడు. అప్పుడు అతనికి ప్రక్కగా ఎమ్. 1.5 శాఖలో ప్రధాన అధికారి కర్నల్ స్మిత్ గూడా ఉన్నాడు.

"మార్షల్! నీవు ఆలోచించేది నాకు తెలుసు." అని ఆయన అన్నాడు.

"ఇప్పుడే వారంటుతీసుకొని వస్తాను."

"వద్దు"

"వదలిపెట్టి ఊరుకొంటే చాలా ప్రమాదకరము."

"అబ్బే! వదలిపెట్టి ఊరుకోవడం ఎన్నటికి కాదు. అతడు కోరుకొంటూఉన్న ఉద్యోగమొకటి యిప్పిస్తాను. యూరోపియను సర్వీసులో ఇతనిని ఒక బ్రాడ్‌కాస్టరుగా తీసుకొనమని బి. బి. సి. వారిని అడుగుతాను."

"ఏమిటీ?" అని మార్షలు అరిచాడు. స్మిత్తు శాంత గంభీరంగా యిట్లా అన్నాడు.

"గాభరాపడబోకు, అతడు అనుకొన్న ప్రకారము జర్మనీకి బ్రాడ్‌కాస్టు చేయనీయండి. యుద్ధసమయాలలో గూఢచారులకు వార్త లందజేసే మార్గాలే చాలా కష్టసాధ్యాలు. అతనికి అవిచ్ఛిన్నమైనదీ, మనకు సురక్షితమైనదీ ఒక మార్గము చూపిన వారమైతే అతని సమస్య పరిష్కారమై పోతుంది."

మార్షలు కిది నచ్చలేదు. కాని, విధిలేక ఊరుకోవలసి వచ్చింది. అతడు పోలీసు అధికారి; గూఢచారులను పట్టుకొనే

విద్యలో తరిబీతు పొందినవాడు. అతనికి ఎంతసేపూ దొరికిన వాళ్ళను పట్టుకొని బంధించవలెననే ఉద్దేశమే కాని, వాళ్ళను వదలిపెట్టి చూస్తూ కూర్చోవలెనని ఉండదు. స్మిత్తు పన్నిన పన్నుగడ అతనికి ఒకవిధంగా నచ్చింది. హెన్రీ ఎప్పుడూ ప్రత్యేకంగా తాను వ్రాసిన రచనలను బ్రాడుకాస్టు చేయడానికి పూనుకొనేవాడు. అతని రచనలను మొదట శ్రద్ధగా విని, అతడు పోదలచుకొన్న పంథాలను గమనించి, తరువాత కార్యాన్ని నిర్ణయించుదా మనుకొన్నారు. అందు నిమిత్తము బి. బి. సి. వార్తాసమీక్ష శాఖవారు జాగ్రత్తచేసి ఉంచిన అతని రికార్డులను సవిమర్శక దృష్టితో వింటూ పరిశీలనకు పూనుకొన్నారు.

బ్రాడ్ కాస్టింగు స్టేషనునుంచి ఒక ఉత్తరము హెన్రీకి వెళ్ళింది. వారి పరివారములో జర్మను సెక్షనులో ఒక ఖాళీ వచ్చింది. తన నియామకము విషయము ఆలోచించవలెనంటే దయచేసి వెంటనే రాజకీయ సిద్ధాంత ప్రచార శాఖ డైరెక్టరుకు అర్జీ పెట్టుకోవలసింది అని. తక్కిన అర్జీదారుల మోస్తరుగానే హెన్రీనికూడా రెండుమూడు సారులు తనిఖీచేసి ఉద్యోగము ఇచ్చారు. అతడు కొంచెము పేరుపొందిన నటుడు కావడము కూడా ఆ ఉద్యోగానికి చాలా తోడుపడ్డది. రేడియోద్వారా ప్రసారము చేయవలసిన వార్తలను స్పష్టముగా ఉదాత్త అనుదాత్త స్వరాలతో చక్కగా చదివేవాడు.

## రేడియోలో వార్తాప్రసారం

హెన్రీ ప్రధాన కార్యమేమిటంటే ప్రతిదినమూ వార్తలు చెప్పిన పిమ్మట ఆవార్తలను గురించిన వ్యాఖ్యానము తయారు

చేసి మాట్లాడడము. ఈ వ్యాఖ్యానాల ముఖ్యోద్దేశము హిట్లరును ప్రపంచ దృష్టిలో న్యూనపరచడమూ, జర్మనీ దేశస్థుల సాంఘిక బలమును పాడుచేయడమూ.

ఇదివరకు బ్రిటిషువారు బ్రాడ్ కాస్టు చేసేటప్పుడు మధ్య మధ్య సరిగా వినిపించకుండా ఉండేందుకు జర్మనీవారు రేడియోలో కొన్ని ధ్వనులు పుట్టించేవారు. 1943 సంవత్సరములో హెన్రీ జర్మనుల గురించిన వ్యాఖ్యానాలను చదివేటప్పుడల్లా మధ్యమధ్య కరుక్రుమని శబ్దాలు, పిట్టలు కూసిన ధ్వనులు రేడియోలలో వినబడుతూఉండేవి. ఆ ధ్వనులు ఉద్దేశపూర్వకంగా కొన్ని కొన్ని సందర్భాలలోనే చేయబడుతూన్నవనీ జర్మనీలో కాక, ఆ అంతరాయాలు ఇంగ్లాండులోనే కలిగింపబడుతూన్నవనీ ఎవరికీ తోచేది కాదు.

ఇన్ని చేసినప్పటికీ కొన్ని కొన్ని భాగాలు జర్మనుల చెవిలో పడుతూనే ఉండేవి. వారు తమ బ్రాడ్ కాస్టులద్వారా హెన్రీని దుమ్మెత్తిపోసి తిట్టేవారు. కర్నలు స్మిత్తు ఇదంతా పరిశీలిస్తూనే ఉన్నాడు.

నిజంగా కొన్ని తమాషాలుకూడా జరిగినవి. ఒక్కొక్క సమయంలో హెన్రీ మాట్లాడేటప్పుడు ధ్వనులు పుట్టించడానికి వీలుపడేదికాదు. ఈ ధ్వనులు పుట్టించడము చాలా మెళకువతో చేయవలసిన పని. ఈపని ఇంగ్లాండులోనే జరుగుతూన్నదని జర్మనీవారు ఏమాత్రమూ అనుమానపడకూడదు. ఇటువంటి సమయాలలో హెన్రీ బ్రాడ్ కాస్టులు గోడదాటి పైకి పోయేవికావు. ఆసంగతి అతనికి తెలియదు. మంచిహుషారులో అభినయ పూర్వకంగా చదివేవాడు. బి. బి. సి. స్టేషను యావత్తూ మామూలుగానే పనిచేస్తున్నట్లే కనబడుతుండేది.

హెన్రీ మాటలాడిన దంతా రికార్డు చేయబడేది. దానిని తరు వాత గ్రామఫోను మీాద విని, తన లోపాలు సవరణ చేసు కొనేవాడు.

హెన్రీ జర్మను గూఢచారుల దళములో ఒక ప్రము ఖుడు. కాని బహిరంగంగా ప్రపంచదృష్టిలో ఒక ప్రబలవిరోధి. ఎంతో ప్రయత్నము మీాద తన దేశానికి వార్తలు అందజేయ గల స్థితిలోకి వచ్చాడు, కాని, ఇతరులు అటువంటి వార్తలు తనకు ముందు అందించవలసి ఉన్నది.

హెన్రీ అష్టదిగ్బంధనలో ఉన్నాడు. సహస్రాక్షునివలె ఇంటలిజన్సు డిపార్టుమెంటు అతని చవరాా గమనిస్తూ ఉన్నది. చాలామంది అనుమానస్థులు చిక్కారు. అనేక విషయాలు బయటపడినవి. ఆ అనుమానస్థులలో ఒకరిని విధిలేక అరెస్టు చేయవలసి వచ్చింది. ఆ అరెస్టును గురించిన విషయము చాలా చిత్రంగా ఉంటుంది.

పంచప్రాణాలు బిగపట్టుకొని శత్రుమధ్యంలో అంత కాలము హెన్రీ ఉండగలిగాడంటే ఎంత జాగ్రతగా ఉన్నాడో, ఆపని ఎంత కష్టసాధ్యమో సులభముగానే ఊహించుకోవచ్చు కాని తనకు సంబంధించినవాణ్ణి అరెస్టు చేయగానే, తననుకూడా కనుగొన్నారేమో అని హెన్రీకి తత్తరపాటు కలిగింది.

హెన్రీ డబ్లిను పారిపోవడానికి ప్రయత్నించాడు కాని సాధ్యపడలేదు.

"ఇంకా ఎందుకు అనవసర కాలయాపన ? పని పూర్తి చేద్దాము" అని మార్షలు స్మిత్తుతో అన్నాడు.

"ఇప్పుడే కాదు; ఇంకా కొంతకాలము ముల్లరుకు చేసి నట్లు చేయాలి" అని స్మిత్తు అన్నాడు.

# ముల్లరు కథ

ముల్లరు కథ ప్రసిద్ధమైనది. 1914-18 నాటి యుద్ధములో అతడు బహుచురుకైనజర్మను గూఢచారి. ఇంగ్లాండులో తిరుగుతూండేవాడు. అతని సహచరుని అవివేకముమూలంగా పట్టుబడ్డాడు. అతడు పట్టుబడిన సంగతి ఎవరికీ తెలియనీయలేదు. ముల్లరుకు బదులుగా అతని పని మరొకడిచేత చేయించేవారు. జర్మనీకి మామూలుగానే ముల్లరు పేరుతో రిపోర్టులు పోతూండేవి. ముల్లరు చచ్చిపోయినతర్వాత కూడా నాలుగు నెలలవరకు వారానికి ఆరు పౌనులు చొప్పున అతనికి జీతము ఇచ్చారు. తరువాత అతడు పంపినవన్నీ అబద్ధాలని అతడు ద్రోహి అనీ నిర్ణయించారు.

ముల్లరు పేరిట జర్మనీనుంచి వచ్చిన డబ్బుతో స్కాట్లాండు యార్డువారు ఒక కారునుకొని దానికి "ముల్లరు" అని పేరుపెట్టారు.

మళ్ళీ స్మిత్తు అన్నాడు:

"హేగ్రనీ వలెనే మాటలాడగలిగిన ఒక నటుణ్ణి తయారు చేసి ఉంచాను. కాబట్టి హేగ్రనీ వ్యాఖ్యానాలు మామూలుగానే కొన్నాళ్ళపాటు బ్రాడుకాస్టు చేయబడుతవి." అని.

హేగ్రనీ జెయిలులో ఉన్నప్పటికీ అతని వ్యాఖ్యానాలు గాలిలో పోతూనేయున్నవి. అకస్మాత్తుగా అవి ఆపుచేయబడినవి. స్మిత్తు చాలా దూరదృష్టి గలవాడు. శత్రువులకు ఎంతవరకు అనుమానము కలగకుండా ఉంటుందో అంతవరకు సాగనిచ్చాడు. తరువాత నిలిపివేశాడు.

ఈకథ పూర్తిఅయింది. కాని పాఠకులకు ఇంతటితో

తృప్తి కలుగదు. హెన్రీ కథ అంతా విన్నాము. కాని, ఒక ముఖ్య విషయము తెలియలేదు. అతడు ఏ వార్తలను జర్మనీకి ఏ విధంగా తెలియజేశాడు?

ఇది అడగవలసిన ప్రశ్న. దీనికి సమాధానము లేకపోతే ఇదంతా ఉప్పులేని పప్పు అవుతుంది.

మచ్చుకు ఉదాహరణ. హెన్రీ వాఖ్యానాలన్నీ ప్రచారమునిముత్తముతయారు కాబడినవని యిదివరకే చెప్పుకొన్నాము. 1943 మార్చి నెల 10 తేదీనఅతడు చదివిన వాఖ్యానములో ఈక్రిందిది ఒక పేరా :

"The latest bulletin from Moscow is encouraging for the democrats. In the Ukraine the invaders are firmly held, while at Novorossisk in the Caucasus the same story is told. Hitler's gamble has failed as brute force must always fail when pitted against the spirit of a united people. Contrast his vituperations with the sincerity and generosity of Mr. Eden's promise to restore Norway's sovereignty and prosperity once the war is won-as it will be won-by the democratic powers."

ఈ పైని కనబడే ప్రదేశాలపేర్లు వ్యక్తులపేర్లు తీసుకొని వాటి మొదటి అక్షరాలు కూర్చండి. Munchen అవుతుంది. మ్యూనిచ్‌కు జర్మనీభాషలో అదే పేరు. ఆరాత్రి ఆర్. ఏ. ఎఫ్. వారు 500 టన్నుల బాంబులవర్షము మ్యూనిచ్ మీాద కురిపించారు. జర్మనీవారికి ఈవిషయము తెలియదు. కారణ మేమిటంటే హెన్రీ మాటలాడేటప్పుడు దీనిని ఆగదిలోతప్ప బైటికి

వినబడనీయకుండా చేశారు. ఆతని రచనల ముసాయిదాలు చాలా సునిశితంగా పరిశీలింపబడేవి. ప్రమాదాలు లేని భాగాలు బాహాటంగా ప్రసార మవుతూండేవి. హిట్లరు మీద మహా దూకుడుగా పోయేది ఆబాణి. ఏమాత్రము ప్రమాదానికి స్థాన మున్నదని అనుమానము తోచినా ఆ ఘట్టాలలో మేఘ గర్జ నలు, మృగారావములు, పక్షుల కిలకిలారావ్యాలు మోపు అవు తూండేవి. వాటిని ప్రజలు వాతావరణ దోషాల క్రింద జమకట్టేవారు.

## 3

ఒకడు గూఢచారిగా పదిహేను సంవత్సరాలు పని చేశాడు. కాని, అతడు చేయవలసిన ఘన కార్యము అంతా రెండు రోజుల్లోనే పూర్తిచేశాడు.

అతని పేరు విలియమ్స్. 1924 సంవత్సరములో బ్రిటీషు నౌకాశాఖా ఉద్యోగి ఒకడు విలియమ్స్ దగ్గరకువచ్చి ఉద్యోగ మిస్తానన్నాడు. విలియమ్స్ చాలా పరిశోధక నవలలూ, గూఢ చారుల వృత్తాంతాలు అంతకు క్రితమే చదివినవాడు కావడము వల్ల ఆ ఉద్యోగానికి సంతోషముగా ఒప్పుకున్నాడు. ఆ ఉద్యో గము పేరుకు మాత్రము "నేవల్ ఏజంటు" అని. కాని పని మట్టుకు గూఢచారి పనే.

అతడు పట్టరాని సంతోషంతో కొంచెం ఒళ్లు విరుచు కోవడము ప్రారంభించి బయటపడడానికి సిద్ధపడ్డాడు. ఇటువంటి వారు గూఢచారి వృత్తికి అసలు పనికిరారు. కాని, అతడు చాలా దక్షుడు గావడంవల్ల నౌకాశాఖోద్యోగి చురుకు తగిలే టట్లు జాగ్రత్త అని హెచ్చరించి అతణ్ణి సరిచేశాడు.

ఒక వెల్షు బొగ్గు వ్యాపార సంస్థకు విలియమ్స్ ప్రభుత్వ

ప్రతినిధి. అతని స్థావరము దక్షిణ అమెరికాలో ఒక రేవుపట్టణము. అతడు స్పానిషుభాష చక్కగా మాట్లాడగలడు. అతడు స్వచ్ఛమైన బ్రిటీషువాడు; దేశభక్తికలవాడు.

తాను చేయవలసిన పని ఏమిటో అతనికి ముందుగానే బాగా తెలుసు. తనకు ఏ జర్మను ఏజంట్లను కనిపెట్టి ఉండడానికి తాకీదులు వస్తవో అని, బహుశా తనకు సహాయకారిణిగా ఒక అందగత్తెను పంపిస్తారని లొట్టలువేస్తూ కూర్చున్నాడు.

కాని, అటువంటిదేమీ జరగలేదు. నాలుగేండ్లకొకసారి విలియమ్స్ సెలవుమీద ఇంటికి వచ్చినప్పుడు నౌకాశాఖా కార్యాలయానికి వెళ్ళేవాడు. అక్కడివారు అతనితో సగౌరంగా మాట్లాడి పంపించేవారు. ఇంతకంటే మరి వేరే విశేషాలే లేవు.

1938 సంవత్సరము వచ్చింది. నౌకాశాఖవారికి దూరదృష్టి ఎక్కువ. వారు పొందే శిక్షణఅటువంటిది. ముందువచ్చే అపాయాలను ఇప్పుడే పసిగట్టి జాగ్రత్తపడే మేధాసంపత్తు వారిలో ఉన్నది.

విలియమ్స్ పనిలో ప్రవేశించి పదునాలుగేండ్లు గడచిపోయినవి. అతనికి వయస్సుమళ్ళి, వార్ధక్యం ప్రవేశించింది. అందగత్తెలైన గూఢచారిణులను గురించిన భ్రమ తొలగిపోయింది. పైగా తాను చేయవలసిన పనియొక్క తరహా ఏమిటో తెలిసిపోయింది. "నేవల్ ఏజంటు" అయినవాడు, తన పని తాను చూసుకొంటూ రెండుకళ్లూ విప్పుకొని తిరగాలి. విలియమ్స్ ఆ పని బాగానే చేస్తూ ఉన్నాడు. మ్యూనిచ్ గండం గడిచింది. అయినప్పటికీ నౌకాశాఖవారు అమిత జాగ్రత్తలో ఉన్నారు. నావికాబలము ఎప్పుడూ శత్రువు ఎక్కడ ఉన్నాడో కనుక్కోవలెనని ప్రయత్నిస్తూ ఉంటుంది. కాని మహాసముద్రాలు

అనంతములు.

యుద్ధము ఒక నెలకు ఆరంభము అవుతుందనగా జర్మనీ యుద్ధనౌక "వాన్‌స్పీ" అనే పేరుగలది అట్లాంటిక్ మహా సముద్రములోకి వెళ్ళింది. అది చాలా శక్తిగల నౌక. తనంత పరిమాణముగల మరి యే నౌకనైనా అమాంతంగా ముంచి వేయగలదు. తనకంటె మించింది తటస్థించి నప్పుడు తురిగిన తూనీగలాగ మటుమాయమైపోవనూగలదు.

ఈ రెండు తెలువులూ ఉన్నవి దానిదగ్గర. ఈ "వాన్‌స్పీ" చేసే పని ఏమిటో అందరికీ తెలిసిందే. మిత్రమండలివారి వర్తక నావలను కొల్లగొట్టడమూ, వారి నావికా బలాలను చెల్లాచెదరుచేయడమూ దాని ముఖ్య సంకల్పము.

యుద్ధము ప్రకటించారు. ఆ మరునాడే ఆ నౌక పోర్చుగీసు ఆఫ్రికాలోని ఒక హార్బరులోనుంచి బయటికి వచ్చింది. ఇక వేట ప్రారంభమైంది. "వాన్‌స్పీ" ఇంటికి చేరే దోవలన్నింటినీ బలంగల నావికావర్గాలతో బందుచేసి కాపరవేశారు.

వీరవిహారముచేసే యుద్ధనౌకలకు పదార్థాలు సరఫరా చేయడానికి కొన్ని చిన్న నావలుంటవి. అవి వాటి ప్రోగ్రాముల ననుసరించి సూచనలుబట్టి పదిహేనురోజులకో, నెలకో ఒక సారి యుద్ధనౌకలకు కావలసిన పదార్థాలన్నీ సప్లయిచేస్తూ ఉంటవి. వీటిని సరఫరా నౌకలంటారు. యుద్ధనౌకలు శత్రువుల వర్తకనావలను కొల్లగొట్టినప్పుడు వీటితో సాధారణంగా అవసరము ఉండదు.

పద్మవ్యూహములో చిక్కుకొన్న 'వాన్‌స్పీ' కి యిక సప్లయి నౌకలేగతి అయినవి. నేవల్ ఇంటలిజన్సు శాఖవారు గాఢమైన పనిలోకి దిగారు. "వాన్‌స్పీ" కెప్టెన్ అయిన హాన్సు

లాన్సుడరు మూడు నెలల వరకు దానిని సముద్రములోనే నిలిపి ఉంచాడు. తనని వెంబడించేవారిని తప్పించుకొన్నాడు. కాని అతని సప్లయి నౌకలకు ఆ అదృష్టము లేకపోయింది. పదార్థాలు నింపుకొనే నిమిత్తం వాటిని తటస్థరాజ్యాల తీరాల్లో ఉంచవలసి వచ్చేది. అక్కడ కాపలాఉన్న గూఢచారులు ఇతర దేశాలలో ఉన్న వర్తకసంస్థలకు వ్యాపారసరళిలో కేబిల్సుపంపే వారు. ఒకప్పుడు అవి లండనుకూ వెళ్ళేవి. వీటన్నిటికీ ఫలిత మేమంటే బ్రిటీషు క్రూయిజర్లు వచ్చి రవాణాకు సిద్ధంగాఉన్న ఆ సప్లయి నౌకలను అడ్డంగొట్టి నాశనంచేసేవి.

సముద్ర మధ్యంలోఉన్న "వాన్ స్పీ"కి ఆహార పదార్థాలుకానీ, పెట్రోలు వగైరాకాని అందడములేదు. అర్థాన్నన్ని తింటూ రోజు రోజుకు ఆ నౌక కృశించిపోతూఉన్నది.

ఆ కాపలాదారులలో విలియమ్స్ ఒకడు. అతడు ఇంత వరకు చేసినపని ఏమీలేదు. ఒకనాడు తన వ్యాపారసంస్థనుంచి వచ్చినట్లుగా ఒక కేబులు అతనిపేర వచ్చింది.

"Yours 2 nd inst. Three tons aluminium address it canadian account to Omaha market."

వ్యాపార సందర్భములో మామూలుగా వచ్చే ఒక కేబులు.

విలియమ్స్‌కు వేడెక్కింది. మొదటి మూడుమాటలు సూత్రప్రాయాలు. ఏమంటే రెండో తారీఖున అతడు ఎవరికీ వ్రాయలేదు. ఆ ఆధారము తీసుకొని ఆ కేబులులోఉన్న మాటలలో ప్రతి రెండవ అక్షరము విడదీసి కూర్చుకొని చదువుకొన్నాడు. "హోల్డు టకోమా" అనే కబురు అందులో విద్యుద్దీపికవలె మెరసిపోయింది. "టకోమా" అనే సప్లయి ఓడకు విలియమ్స్ ఉన్న పట్టణపురేవులో అప్పుడు సరకు ఎత్తు

తున్నారు. అదిపైకి వచ్చినవారి నౌకవలె కనబడుతున్నది. తప్పడు బావుటా ఉన్న నౌక తప్పకుండ అనుమానించ తగి నదే. కాబట్టి 'టకోమా' హార్బరు విడిచి బైటికి పోగూడదు. దానిని పోనియ్యకుండాచేసే బాధ్యత విలియమ్స్‌మీద పడింది.

పదిహేనేండ్లకు సెలవుగా అతనికిప్పటికీపని నిర్దేశింప బడింది. ఏమైనాసరే యీ పనిలో తాను కృతకృత్యుడుకావలె ననుకొన్నాడు. ఆలోచించాడు. బొగ్గులో బాంబు పడేద్దామా అనుకొన్నాడు. కాని అతనికి ఉత్తరువులు ఆపమనేకాని,ధ్వంసం చేసి ముంచమని కాదుకదా?

అతడు స్పానిషుభాష ధారాళంగా మాటలాడగలడు. ఒక చినిగిపోయిన సూటు-మాసిన గడ్డము-మారు వేషానికి చాలు. 'టకోమా' పడవలోకి సరుకులు రవాణాచేస్తున్న కూలీ లలో తనుకూడా ఒక కూలీగా చేరాడు. ఇన్నాళ్ళూ బొగ్గు వ్యాపారంలో ఉన్నవాడు కాబట్టి ఓడలో ఉండే ఇంజన్ల సంగతి అతనికి కొంత తెలుసు. అక్కడ ఎవరూ కాపలా లేరు. అది వర్తకపు టోడ కావడంవల్ల అందరూ బేపర్వాగా ఉన్నారు. జర్మనీ ఏజంట్లయినా అన్నిచోట్లా ఉండగలరా?

విలియమ్స్ పడవలోకి ప్రవేశించాడు. ఎవరూ చూడ కుండా ఆ యింజన్ల దగ్గరకువెళ్లి, ఏవో కొన్ని మరలు అటూ యిటూ త్రిప్పి కొన్ని మరలు ఊడదీసి సముద్రములో పార వేసి, కొన్ని నట్లు తారుమారుచేసి గప్‌చుప్‌గా మళ్లీ కూలి పనిలోకి పోయినాడు. నష్టమేమీ కలుగలేదు. కాని, "టకోమా" కదలడానికి వీలులేకపోయింది. తరువాత అకస్మా త్తుగా అతనికి మళ్ళీ ఉత్తరువులు వచ్చినవి. ఒక రాత్రివేళ బ్యూనో ఎయిరోనుంచి అతనికి ఒక టెలిఫోను పిలుపువచ్చింది.

శ్పానిషుభాషలో ఏవో మామూలు కబుర్లు - సెన్గారువాండ్లు వింటూ ఉంటారాయె - మాట్లాడుకొన్నారు. బొగ్గు నిలవ ఎంత స్టాకులో ఉన్నది, వాటి ధరలు వగైరా మాట్లాడుతూ అంతా అయిపోయినతరువాత ఆ చివర ఉన్నవాడు ఏదో విషయము అప్పుడే జ్ఞాపకమువచ్చినట్లుగా యిట్లా అన్నాడు.

"అన్నట్లుగానే మరచిపోయినాను. నీ దగ్గర అట్టిపెట్టుకొన్న అమ్మాయిని వాళ్ల అమ్మదగ్గరకు పంపించు పాపము! వాళ్ళకు ఒక్కతే పిల్ల. రేడియో ద్వారా తల్లికి ముందుగా కబురుచేయి.''అని.

రెండు దినాలకు పూర్వము ఒక బ్రిటీషు క్రూయిజరు 'ఉసుకుమా'అనే సప్లయి నౌకను పట్టుకొన్నది. అది 'వాన్‌స్పీ'కి నిర్ణయింపబడ్డ సరఫరా నౌకలలో 'ఉపధా' నౌక. అంటే Last but one. కాబట్టి యిక'టకోమా' ఒక్కటే 'వాన్‌స్పీ'కి ఆధారము. విలియమ్స్ కుశాగ్రబుద్ది కాబట్టి పన్నాగాన్ని బాగా అర్థముచేసుకొన్నాడు. 'టకోమా ఎక్కడికి వెళ్ళితే అక్కడికి 'వాన్‌స్పీ' కూడా వచ్చితీరాలి. మరి జరూరుగాకూడా రావాలి. ఆ సప్లయినౌక ఇంజన్లకు త్వరితగతిలో మరామత్తులు జరుగుతూఉంటే ఉల్లాసంగా చూస్తూ ఉన్నాడు.

'టకోమా' వంటశాలలో తయారయిన కాఫీనే అందులో పనిచేసే వాండ్లందరూ త్రాగడం మామూలు. రాత్రికి వంటచేసే సమయంలో విలియమ్స్ పాకశాలలోకి ప్రవేశించాడు. ఒక మూలికాభస్మాన్ని కొద్దిపాటి డోసులో ప్రయోగించాడు. భోజనముచేసినతరువాత అందరు ఎక్కడివారక్కడ చప్పగాపడి నిద్రపోయినారు. అందరూ గుఱకలుపెడుతూ గాఢనిద్రలో ఉండగా విలియమ్స్ నిర్భయంగా రేడియో గదిలోకి

పోయి వార్తలను వింటూ చెప్పుతూ కూర్చున్నాడు.

పెట్రోలు — ఆహారపదార్థాలు సొంతమైపోయి ఘోరు ఘోరు మంటూ టర్కోమానుతో కలుసుకోవడానికి యుద్ధ నౌక 'వాన్‌స్పీ' పడమరగా బయలుదేరింది.

మూడు బ్రిటీషు క్రూయిజర్లు దానికోసము కూర్చున్నవి. 1939 డిశెంబరు 13వ తేదీన ఆ మూడు బ్రిటీషు క్రూయిజర్ల మధ్య చిక్కి 'వాన్‌స్పీ' ధ్వంసమైపోయింది. రెండేండ్ల తరువాత విలియమ్స్ పింఛను తీసుకొని యింటికి వచ్చాడు.

# 4

జర్మనీవారు అనుమానస్థులను అతి జాగ్రత్తగా పరిశీలిస్తారు. కాని, చివరకు కాస్తలో బోల్తాపడతారు.

దక్షిణ జర్మనీగుండా స్విట్జరులెండు ప్రాంతాలకు రైలు వస్తూఉన్నది. దేశాల సరిహద్దు ప్రాంతాలలో జరిగే పరిశీలన చాలా నిదానంగానూ, నిశితంగానూ జరుగుతున్నది. ఫస్టుక్లాసులో ప్రయాణము చేస్తూఉన్న ఒకరిద్దరు తమ మోతుబరిని తెలిపే కాగితాలను గురించి కొంచెము భయపడుతున్నారు.

సీజరు ఆ పెట్టెలో ఒకమూల ఏమీ తొట్రుపాటు లేకుండా శాంతంగా కూర్చున్నాడు. అతడు స్విట్జరులెండు దేశీయుడు. స్వదేశానికి తిరిగి వెళ్ళుతూ ఉన్నాడు. పైగా అతడు జర్మనీ ప్రభుత్వానికి సాయపడుతున్న సంస్థలో పని చేస్తుండడము వల్ల అతనంటే అందరికీ కొంచెము గౌరవము. అతనికి వ్యాపార సంబంధాలలో అప్పుడప్పుడు కొంచెము అసహ్యాముకలిగినా ఆభావాలను బైటపడనీయకుండా కప్పిపుచ్చి తిరిగేవాడు.

స్విట్జరు లెండులో నివసిస్తూఉన్నాడు కాబట్టి అక్కడికిపోకతప్పదు. అప్పుడా దేశాన్ని జర్మనీ వారు చుట్టుముట్టడించి ఉన్నారు.

అతనికెదురుగా ఒక యువతి కూర్చొని ఉన్నది. ఆమెకు. మనస్సు మనస్సులో లేదు. చదువుతూన్న మాసపత్రికను అవతల పెట్టి కిటికీలోనుంచి బైటికి మధ్యమధ్య అటూ యిటూ చూస్తున్నది.

"ఇక్కడి నిబంధనలు చాలా కఠినంగా ఉంటవి కాబోలు! యుద్ధము మొదలు పెట్టిన తరువాత నే నెప్పుడూ యిటు రాలేదు" అని ఆమె తొట్రుపాటు పడుతూ సీజరును అడిగింది.

"గోరంతలు కొండంతలు చేస్తూ ఉంటారు. మీ కాగితా లన్నీ సరిగానే ఉన్నవి కదూ? అయితే ఏమీ ఫర్వా లేదులే" అన్నాడు సీజరు.

"అన్నీ సరిగానేఉన్నవి. నేను మానాన్నగారి దగ్గరకు వెళ్ళుతూఉన్నాను. బర్న్ కాన్సులేటులో వారికి ఒక ఉద్యోగము."

"అయితే ఇంకేమి భయము? హాయిగా కూర్చుని పోవచ్చు."

"లోకులు చెప్పుకొనే కబుర్లు చూస్తే—"

"నిజమే! సరిహద్దు ప్రాంతాలలో వాళ్ళుచాలా జాగ్రత్తగా ఉండక తప్పదు. గతయుద్ధంలో మోస్తరుగా లేదు ఇప్పుడు. వెనకటి యుద్ధంలో స్విడ్జరులాండు గూఢచారులకు కేంద్రంగా ఉండేది. ఇప్పుడు దేశము అన్నివైపులా జర్మనీవారు కాచుకొని ఉండడమువల్ల అట్లాకావడానికి వీలులేదు. గూఢ చారులకు ఏవైనా విషయాలు తెలిసినా గమ్యస్థానానికి చేర

వేయడము సాధ్యముకాని పని. ఏదీ మీ మాసపత్రిక ఒక సారి చూడనిస్తారా ?''

"దానికేమి భాగ్యము ?" అని ఆమె సంచిక తీసి సీజరుకు ఇచ్చింది.

"అయితే తమరు ఇవ్వాళటి దినపత్రిక "జీటంగ్" చూశారా ? ఇదిగో ! నాదగ్గర ఉన్నది." అని సీజరు తన దగ్గిర ఉన్న దినపత్రికను ఆమెకిచ్చి ఆమె మాసపత్రికను తాను తీసుకొన్నాడు.

సీజరు శాంతంగాను ధైర్యంగాను ఉన్నాడు. అతని వైఖరి అందరికి ధైర్యాన్ని కలిగించింది. పరగణాలను తరుచుగా దాటేవాడే అంత నిర్భయంగా ఉంటే తతిమ్మా వారికేమి భయము ?

జర్మనీవారి ఆఖరు స్టేషనులో బండి ఆగిపోయింది. స్పెషలుపోలీసు ఆఫీసర్లూ, కస్టమ్సు ఆఫీసర్లూ గుంపులు గుంపులుగా తనిఖీ నిమత్తము బండిలోకి ఎక్కారు.

ఆపరిశీలన అంతా యధావిధిగా గంభీరంగా జరిగే కర్మకాండ. అందరి కాగితాలు తీసికొని ఒకటివెంబడి ఒకటి పరీక్షిస్తున్నారు. అందరిలోకి ఆ యువతి పరీక్ష చాలా త్వరలో అయిపోయింది. ఆమె ప్రభుత్వోద్యోగి కూతురు అని తెలియజేసే గుర్తులు ఆమె ప్యాసుపోర్టులో ఉన్నవేమో ! వెంటనే ఆ కాగితాలు ఆమెకిచ్చి వదలివేశారు. ఆ పోలీసు ఇన్స్పెక్టరు మాత్రం సీజరుకు ఎదురుగా నిలువబడ్డాడు. సీజరు ఆశ్చర్యంతో చకితుడైనాడు.

'ఈ ప్యాసుపోర్టు—' అని సీజరు ప్యాసుపోర్టును చేత్తో పట్టుకొని ఆ ఇన్స్పెక్టరు ఏదో చెప్పబోయినాడు.

"ఇది ఎప్పుడూ మీరు మామూలుగా చూచేదేనండీ', అని సీజరు అన్నాడు.

"తమరు దయచేసి నా వెంట రండి." అని ఇన్స్పెక్టరు సీజరును వెంటబెట్టుకొని తీసికొని పోయినాడు.

సీజరు ముఖము జేవురించింది. ఒకపోలీసువాడు సీజరు తాలూకు సంచినికూడా బండిలోనుంచి లాక్కొని వారిని వెంబడించాడు. జర్మనీలో ఎప్పుడూ కిందివాళ్ళతో వాదించి లాభము లేదని ఆతనికి తెలుసు. ఆతనిని హోమ్ఆఫీసు ఇన్స్పెక్టరు దగ్గరకు తీసుకొనివెళ్ళి కూర్చోబెట్టారు. అతనితో సీజరు ఎంతయినా వాదించవచ్చు.

"తమరు దయచేసి క్షమించాలి. ఇది నాకు చాలా కష్టంగానే ఉన్నది. కాని, నావిధి నేను నిర్వర్తించక తప్పదు. శత్రువు ఏజంటు ఒకడు మిమ్ములను ఉపయోగించుకొన్నట్లు మాకు తెలిసింది."

"ఏమిటీ?"

"అబ్బే! మీకు తెలిసి చేస్తున్నారనికాదు. మీకు తెలియకుండానే మీ ద్వారా వారి పనులు నెఱవేర్చుకొంటున్నారని" అని ఆ ఇన్స్పెక్టరు వివరణచేసి చెప్పాడు.

వారికి వచ్చిన వార్తలనుబట్టి తెలిసిందేమిటంటే— స్వయంగా సీజరే శత్రుపక్షము ఏజంటు కావచ్చునని— అయినప్పటికి అధికారులందరూ చాలా మెలకువతో ప్రవర్తించవలెననీ వారికి హెచ్చరిక. ఎందుకంటే సీజరుఉన్న వ్యాపారసంస్థ చాలా ముఖ్యమైనది. అవసరమైనది. మళ్ళీ ఆ ఇన్స్పెక్టరు ఇట్లా అన్నాడు.

"అది ఒక మామూలు పన్నాగము. ఒక గూఢచారి

నమ్మకస్థుడైన ఒక ఘరానా మనిషిని ఎన్నుకొని ఆయన సామా నులలో తన వార్తలను భద్రపరుస్తాడు."

"అయితే కావచ్చుకాని – ఇన్స్పెక్టరుగారూ, నా విష యంలో అది సాధ్యమయ్యే పనికాదు. నేనే నా సామానులన్నీ స్వయంగా ప్యాక్ చేసుకొన్నాను."

'చేసుకొంటే చేసుకొన్నారు. మీసంచి తెరవండి. వస్తువులన్నింటిని జాగ్రత్తగా చూడవలసిందే!'

"మంచిది. అలాగే చూసుకొండి."

ఆ పరీక్షచేసే తరహా చూసేటప్పటికి సీజరు నివ్వెరపడి పోయినాడు. కస్టమ్సుడిపార్టుమెంటువారు శాహిరీ కోసము చూచినట్లుగా లేదు. ఆ సంచిలో ఉన్న ప్రతిగుడ్డను జాగ్రత్తగా వేళ్ళతో అంగుళము అంగుళము చొప్పున వెతుకుతూ పరీక్ష చేశారు. ఆతడుతొడుగుకునే దుస్తులను ఇంకాచాలా జాగ్రత్తగా చూచారు. అతడు క్షౌరము చేసుకొనే సబ్బును ముక్కలు చేసిచూశారు. ఆతని బూడ్సులు చూశారు. వాటికి క్రొత్తగా కొన్ని మరమ్మతులు జరిగినట్టుగా కనిపిస్తున్నవి. ఆపరిశీలకులలో ఒకడు ఆతని బూడ్సులుతీసి కుట్టుఊడదీయడము మొదలుపెట్టే సరికి సీజరు పట్టలేక పోయినాడు.

"ఇది చాలా దారుణంగా ఉన్నది" అన్నాడు.

"అయ్యా: ఇది కాగితాలు పెట్టుకొనడానికి చాలా అనుకూలమైనతావు. బూడ్సులకు అడుగున ఉన్న రెండు అట్టలమధ్య చాలా సమాచారము నడుస్తూ ఉంటుంది."

ఈసరికి పరీక్షలోఉన్న అంతర్యమేమిటో అర్థమై ఉంటుంది. ఇన్స్పెక్టరు శాంతంగా ఉన్నప్పటికి అసలు విషయము ఇంకా దాచియుంచలేకపోయినాడు, తానే గూఢచారిగా అను

మానింపబడిన సంగతి సీజరు తెలుసుకొన్నాడు. ఏజంటు అయిన వాడు తన కాగితాన్ని మరొకని సామానుల్లో చొప్పించ గలడు. కాని, వాడి కాగితాలు తీసుకొని వాటిమీద కానరాని సిరాతో రాస్తాడా?

అరడజను మంది సీజరు కాగితాలను చుట్టుముట్టారు. వారందరూ ఈ పరిశీలనలో తరిబీతు పొందినవారే! ఒకడు ఆ కాగితాలన్నీ ఒక్కటొక్కటిగా తీసి కానరాని సిరాలో వ్రాసిన అక్షరాలు కనబడతాయేమోనని విరుగుళ్లు పూశాడు. ఇంకొకడు మైక్రొస్కోపుతో ప్రతి కాగితాన్ని పరిశోధించాడు. ఒకడు ఎఱ్ఱగా కాలిన కడ్డీని ఆ కాగితాలకు దగ్గరగా పెట్టి కింది నుంచి పైకి; పైనుంచి కిందికి నిమ్మళంగా జరుపుతూ వాటిని వెచ్చజేశాడు.

ఎందుకంటే, కొన్ని సిరాలు వేడికి బయటపడతవి. ఇంకొకడు ఆకాగితాలను అద్దాల చట్రముమీద పెట్టి వాని క్రింద అల్ట్రావయొలెట్ కిరణాల దీపము వెలుగున చూశాడు. ఇది యిటీవల కనిపెట్టబడిన నవీన పద్ధతి.

"ఇదంతా మామూలు కర్మకాండేనండి" అని ఇన్స్పెక్టరు చప్పరిస్తూ "తమరు దయచేసి మీ దుస్తులుకూడా ఊడదీయండి" అన్నాడు.

'ఇదేమిటండీ అన్యాయము! నేను మీకు కొత్తవాడినా? ప్రమాణపూర్తిగా——'

'ఈ రోజులనుబట్టి అన్ని నిబంధనలను అమలు జరపవలసిందే! ఏవీకూడా నిర్లక్ష్యంగా వదలిపెట్టి ఊరుకోగూడదు. రైలు మీకోసము కనిపెట్టుకొని ఉన్నది. త్వరగా కానీయండి' అని ఇన్స్పెక్టరు తొందర చేశాడు.

నిరోధించి ఏమీ ప్రయోజనములేదు. దిగంబరుడై సీజరు తలవంచుకొని నిల్చున్నాడు. అతడు తొడుక్కొనివచ్చిన గుడ్డలన్నింటినీ ముఖ్యంగా అస్తరూ మడతలూ ఉన్నచోట క్రమంగా పరిశీలించారు. అతని జేబులో ఉన్న కాగితాలకు కూడా తక్కిన కాగితాల గతే పట్టింది. ఇంకా ఇద్దరు వచ్చి అతనిచుట్టు మూగారు. ఒకడు దువ్వెనతో తల దువ్వాడు. దేహమంతా పరీక్ష చేశాడు. ఎందుకంటే కొందరు గూఢచారులు ఒంటిమీద కొద్దిగా గాయముచేసుకొని ఆ గాయములో సమాచారములు వ్రాసిన చిన్న కాగితము మడతఉంచి పైన మందురాచి పట్టివేస్తారు. అటువంటి లేవీ సీజరుకు లేవు.

రెండోవాడు ఒక చిన్న బ్యాటరీలైటువంటిది తీసుకొని అతని చర్మానికి రెండు అంగుళాల దూరములో పెట్టి దేహమంతా దానివెలుగున పరీక్షచేశాడు. కొన్ని రకాల సిరాలతో దేహముమీద వ్రాస్తారు. ఆ విద్యుద్దీపము వేడికి ఆ అక్షరాలు స్పష్టంగా కనబడుతవి. సీజరు ఒంటిమీద అటువంటి వేవీ కూడా లేవు,

"నేను ముప్పయి యేండ్లనుంచి జర్మనీ స్విట్జరులాండుల మధ్య వస్తూ పోతూ ఉన్నాను. ఎన్నడూ యిటువంటి అవమానకరమైన చర్యకు పాలుగాలేదు." అని కోపంగాను విసుగుతోను గుడ్డలు తొడుక్కుంటూ సీజరు అన్నాడు.

"మీరు కోపపడకండి—" అన్నడా ఇన్‌స్పెక్టరు.

"ఇన్‌స్పెక్టరుగారూ! ఇందులో మీదేముంది? మీరు పైవారి ఆజ్ఞల ప్రకారము ప్రవర్తించారు. ఇతరులు దోషులైన వారుండవచ్చును. అయితే యిక అంతా అయినట్టేనా?" అని సీజరు అడిగాడు.

"ఆ, అంతా అయిపోయినట్టే, కాని ఏదీ! మీచేతిలో ఉన్న మాసపత్రిక, దాన్ని కూడా పరీక్షించినపిమ్మట సర్వమూ సంతృప్తికరంగా జరిగినట్లే."

మళ్ళీ పరికరాలన్నీ తీసి శోధన ప్రారంభించారు. అందులోను ఏమీ కనబడలేదు.

తరువాత సీజరుకు అనేక క్షమాపణలు చెప్పుకొంటూ ఇన్‌స్పెక్టరు బండిదాకావచ్చి బండిలోకి అతన్ని ఎక్కించివెళ్లాడు.

రైలుకదిలింది. జర్మనీదాటి స్విట్జరులాండు సరిహద్దులోకి ప్రవేశించింది. సీజరు ఆయువతిదగ్గరకు వచ్చి "వాళ్ళుచాలా పొరబాటు పడ్డారు. నేనుఒక గూఢచారిపనిని చేస్తున్నానని అనుకొన్నారు. అంతాబాగానే వెళ్ళిపోయిందికాని పాపము మీ మాసపత్రిక మాత్రము పాడయిపోయింది." అంటూ ఆ పత్రిక పేజీలలోపడిన మచ్చలను చూపించాడు.

"కానరాని సిరాలతో రాసినదానిని కనిపెట్టడానికి విరుగుళ్ళుపూశారు. దానిమచ్చలన్నీ యిట్లాపడి సంచిక పాడయిపోయింది. చాలావిచారిస్తున్నాను. క్షమించాలి" అన్నాడు.

"పోతే పోయిందిలెండి. దానిని సాంతంగా చదివేశాను." అని ఆమెఅంటూ "ఇదిగో మీదినపత్రిక జీటంగ్" అని ఆమె ఆ పత్రికను సీజరుచేతికి ఇచ్చింది.

"ఓహో! తెండి. పత్రికలో నాకుకావలసిన ప్రకటన ఒకటి ఉన్నది."

సీజరు పత్రికతీసుకొని జాగ్రత్తగా జేబులోబెట్టుకున్నాడు. కొన్ని గంటలకు తరువాత ఆతడు స్వగృహంలో ఏకాంతంగా కూర్చొని ఆ "జీటంగ్" దినపత్రికను తీసికొని తాన్నూ తన బ్రిటిషుస్నేహితుడు మరొకడూ కలిసి దాని అంచుల వెంబడి

విరుగుళ్ళు ప్రయోగించి దాని మీదకనబడిన సమాచారాలకు ప్రతులు వ్రాసుకొన్నారు.

ఆ బ్రిటిషు స్నేహితుడు వ్రాసుకొంటూ మధ్యలో "ఈ పర్యాయము ఎట్లా తీసికొని రాగలిగావు ?" అని ప్రశ్నించాడు.

"చాలా సులభంగా తెచ్చాను. జర్మనులు చాలా జాగ్రత్త కలవారే కాని ఎదుటఉన్నదాన్నే వదలిపెట్టి ఊరు కొంటారు." అని సీజరు సమాధానము చెప్పాడు.

## 5

మొన్న జరిగిన యుద్ధంలో జర్మనీవారెప్పుడూ బ్రిటిషు వారి ఆయువుపట్టులవంటి సైనిక కేంద్రాలమీదనూ, విమాన దాడులను నిరోధించే వస్తువాహనాలమీదనూ, దెబ్బతీసి ధ్వంసము చేయటానికి ప్రబల ప్రయత్నాలు చేస్తూ ఉండేవారు. వీనిని ధ్వంసము చేయగలిగేటట్లయితే ఇంగ్లాండుమీద ఇష్టము వచ్చినట్లు బాంబుల వర్షము కురిపించి దేశాన్ని ముట్టడించ వచ్చునని వారి ముఖ్యోద్దేశము. ఇది ఎన్నడూ జరుగలేదు. కాని జరిగేటంతవరకూ వచ్చింది

ఇది ఆ రోజుల్లో జరిగిన ఒక చిత్రమైన సంగతి.

1940 ఆగష్టు నెలలో స్కాట్లండు యార్డుస్పెషలు బ్రాంచిలో ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తూన్న మార్షలుకు కొన్ని • తాకీదులు వచ్చినవి. వాని సారాంశమేమంటే. ఆరోజుల్లో ప్రధాన యుద్ధకేంద్రంగా ఉన్న నార్మత్ అనేజిల్లాలో (ఇవి మారుపేరు లనే సంగతి జ్ఞాపకముంచుకోండి) జర్మనుల విమానదాడులు చాలా తీవ్రముగా ఉన్నవనీ ఎవరో ముందుగా వివరాలన్నీ చెప్పినట్లుగా ఆ దాడులన్నీ సూటిగా లక్ష్యాలమీద జరుగు

తూన్నవనీ-ఈవిషయాలు ఆచోకీ దీసి సైనికరహస్యాలు ఏవి ధంగా శత్రువులకు చేరుతున్నవో తెలుసుకొని తగిన కట్టుదిట్ట ములు చేయవలెననీ—

నిజానికి జనబాహుళ్యంలో నోళ్లు కట్టివేయడము సాధ్య మయ్యే పనికాదు. ఆలోచనలేకుండా వటవట వాగేవారు అనే కులుంటారు. కాని ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే రహ స్యంగా దాచిపెట్టి వాటిమీద పరదాలుకప్పి రంగులుపూసి (Camouflage) వేయబడిన ఆయుధ సామగ్రిలమీదకూడా దాడులు జరిగినవి.

ఫీల్డు సెక్యూరిటీ ఆఫీసరులు, అక్కడి పోలీసువారు చాలా దర్యాప్తులు చేశారు. అనుమానస్థులందరినీ పట్టుకొని పంపించి వేశారు. ఇంకా కొంత అదనపు సిబ్బందిని వేశారు ఈ పని మీద. కాని ఎన్ని చేసినా విమానదాడులు ఆగలేదు. జరిగే దాడులన్నీకూడా మాడుబద్దలు కొడుతూన్నవి.

మార్షలు లండను వదలిపెట్టి యుద్ధము జరిగేచోటికే వెళ్లాడు.

రెండుదినాలక్రిందట తీవ్రమైన విమానదాడికి గురి అయిన ఆయుధ ప్రదేశాలను తనిఖీచేసే నిమిత్తము అతనిని వెంబడే తీసికొని వెళ్లారు.

అది చాలా ఏకాంత ప్రదేశము. చుట్టుపట్ల మూడుమైళ్ళ వరకూ ఎక్కడా యిల్లూ, వాకిలీగాని, నరసంచారముగాని లేదు.

"ఇక్కడికి ఎవరు వస్తూంటారు?" అని అడిగాడు.

"రెండు రోజులకోసారి రేషను లారీవచ్చి వెళ్లుతూంది. అప్పుడప్పుడు మందుగుండుసామగ్రితో కాని, 'స్పేర్'లతో

కాని ఒకట్రక్కు వస్తూపోతూ ఉంటుంది. అని ఫీల్డు సెక్యూరిటీ ఆఫీసరు జవాబుచెప్పాడు.

"E.N.S.A. (Entertaimments National Services Association) వారు రావడము లేదా?"

"లేదు. వారు చిన్న చిన్న స్టేషనులకు రారు. ఒక Y. M. C. A. టీ వాను మాత్రము అడపా దడపా వస్తూంటుంది.

మార్షలు ఆలోచించాడు. ఇదివరకు జరిపిన విచారణ లన్నీ వృథాఅయినవి. ఈ Y. M. C. A. టీ వానుల సంగతి ఎవ్వరూ ఎత్తుకొన్నట్లులేదు. వీటి సంగతేమిటో కనుక్కుందా మని ఆతడు నిశ్చయించుకొన్నాడు.

అక్కడి స్థానిక వ్యవహర్త జర్మనుగూఢచారిగా కనబడ డములేదు. ఆయన గడ్డము పెంచుకొని ఒక యోగీశ్వరునివలె ఉన్నాడు. ఆయన మెథాడిస్టు చర్చికి సంబంధించినవాడు. పేరు రెవరెండు విలియమ్ జేమ్సు. మార్షలుకు నమ్మకము కుదరలేదు. బహుళ రోమభూయిష్ఠములైన బాహుమూలముల ద్వారా క్రైస్తవబ్రహ్మ చారిణులే గూఢచారవృత్తి నెఱపుతూన్నప్పుడు ఈ యోగీశ్వరుడు మాత్రము ఊరుకొంటాడా? అనే ఆలో చనలో బడ్డాడు.

ఈ టీ వానులు సక్రమ నిర్వహణము విషయములో జేమ్సు చాలా గర్వపడుతూండేవాడు. ఆ వానులు సమస్త పదార్థాలతోను, సౌకర్యాలతోను ట్రావెలింగు క్యాంటీన్లవలె ఉండేవి. ఎక్కడా దిక్కూ, మొక్కూలేని ఎడారుల్లో పడిఉన్న వారికి అవినిజంగా కామధేనువులూ, కల్పవృక్షాలుగా తోచేవి. ఆ వానులన్నిటిమీద ఈ అక్షరాలు ఉన్నవి.

"మిష్టర్ హెన్రీ విల్సను ధర్మము" అని.

మార్షలుకు అప్పటినుంచి తీక్ష్ణత హెచ్చింది. ఏమంటే నిగూఢ రహస్యాన్ని కనిపెట్టడానికి అతనికి ఒక సూచన దొరికింది. హెన్రీవిల్సను రేడియోలు తయారుచేసే ఒక పెద్ద వ్యాపారస్థుడు. అంత పెద్ద రేడియో వ్యాపారము గలవాడు దాని చాటున తనస్వంత ప్రచార కేంద్రమును (Transmitting Station) ఒకటి స్థాపించుకొనడానికి అతనికి బ్రహ్మాండమంత అవకాశమున్నది. ఇటువంటి వాటిని పట్టుకొనడానికి మార్గాలున్నవి కాని పట్టుబడకుండా చేసుకొనే మార్గాలు అతడేమైనా కనిపెట్టి ఉన్నాడేమో?

ఏమైనాసరే! ఇది ఒక ఆధారము దొరకింది. దీనిని అనుసరించి ఇంకా శోధనలు జరుగవలసిఉన్నది. ఆశోధనలలో బయటపడిన మరొక విషయము మార్షలును చకితుణ్ణిగా చేసింది. అప్పుడప్పుడు ఈ టీ వానులలో హెన్రీవిల్సను తిరుగుతూ అన్నిప్రదేశాలూ చూస్తూఉంటాడు అని. ఆయన ధర్మములో నిర్వహింపబడుతూన్న టీ వానులు ఎట్లా పనిచేస్తూన్నవో, ఎలాంటి సౌకర్యాలు కలుగచేస్తూన్నవో, ఇంకా సైనికులకు కావలసిన అవసరాలేవో కనుగొనడానికి సహజంగా అతనికి ఆసక్తి ఉంటుంది. అందులో తప్పేమున్నది? కాబట్టి అక్కడే ఉన్న బ్రిగేడియర్ హెన్రీవిల్సనుకూ, అతని ప్రయివేటు కార్యదర్శికీ పాసులు ఇచ్చాడు.

విల్సను ఇల్లు నార్మత్ కు పదిమైళ్ళ దూరములో ఉన్నది. మార్షలు అక్కడికి వెళ్ళాడు. విల్సను ఇంట్లో లేడు. కాని ఆయన ప్రయివేటు శెక్రటరీ ఇన్నీసు ఉన్నాడు. విల్సను ఇంట్లోనూ, చుట్టుప్రక్కలనూ "బ్లాక్ ఔటు" ఏర్పాటులు సరిగా లేవు. అదీ మార్షలుకు అక్కడికి వెళ్ళడానికి గల మిష. ఇన్నీసు మార్ష

లును సమాధానపఱచడానికి చాలా తంటాలు పడ్డాడు. మార్షల్ అనుకొన్నట్లుగనే ఇన్నీసు ఇల్లంతా చూపించాడు. వెళ్ళగానే ఒకరేడియో ట్రాన్స్మిటరు ఎదురుగా కనపడు తుందని మార్షల్ అనుకోలేదు. కాని దానిని రహస్యంగానే తగినజాగ్రత్తలో ఉంచడానికి అవకాశాలు గలిగినంత విశాల ముగా ఉన్నది ఆయిల్లు.

విల్సను లైబ్రరీ గదిలో మార్షలును ఏకాంతంగా వదలి పెట్టి ఇన్నీసు ఒకనిమిషము వెలుపలికి వచ్చాడు. ఆ కాసే పటిలో బల్లమీదఉన్న కాగితాలను గబాగబా మార్షలు పరిశీ లించాడు. ఆ కాగితాలలో ఏమీ ఆచోకీ దొరకలేదు. అవన్నీ వ్యాపారానికీ, స్టాకు ఎక్స్ఛేంజికి సంబంధించినవి.

మార్షలు హతాశుడుకాకుండా మరొక ఎత్తువేశాడు. ఆ రాత్రికి రెపరెండు విలియముజేమ్సు దగ్గరకు వెళ్ళాడు. ఆయ నతో స్నేహము చేసుకొని చాలా ఆంతరంగికంగా మాట్లాడే వాడిలాగ కనపిస్తూ యిట్లా అన్నాడు:—

"మీరొక చిన్న సహాయముచేసి పెట్టవలసియున్నది. వెస్టన్ డౌన్సులో కొత్తగాపెట్టిన ఆయుధాగారాలకు ఇంకా కొన్నిటీవానులు అధికంగా కావలసి ఉంటాయని దయచేసి మిస్టర్ విల్సనుతో చెప్పగలరా?"

"తప్పకుండా చెప్తాను. విల్సనుగారు ఊళ్ళోలేరు. ఎక్క డికో వెళ్ళారు. కాని ఇన్నీసుగారు వారికి కబురుచేసి పిలిపించ గలరు."

"సరే! నేను తక్కిన పనులు చూచుకొంటాను." అని మార్షలు అన్నాడు.

వెంటనే అతడు విమానదాడులను నిరోధించే యంత్రి

ములకూ, సైన్యములకూ నాయకత్వము వహించిన బ్రిగేడి యరు దగ్గరకు వెళ్ళాడు. ఆ రోజునే వెస్టన్ డౌన్సులోకి మను ష్యులువెళ్లి తుపాకులు వగైరా దాచుకోవడానికి గోతులు తీశారు. అక్కడ దాచిన తుపాకులన్నీ చెడిపోయినవనీ, పనికి రాకుండాపోయిన పాత సమానాలని మామూలుగా వచ్చి చూచే వాడెవ్వడూ తెలుసుకోలేడు.

"వల సిద్ధంగా ఉన్నది." అన్నాడు మార్షలు అక్కడి ఫీల్డు సెక్యూరిటీ ఆఫీసరుతో రహస్యంగా.

"ఈ పన్నాగము మామూలు వానికంటె భిన్నంగా చాలా బాగున్నది. ఈ కొత్త ఆయుధాగారాలను చూడడానికి మిస్టర్ విల్సను దయచేస్తారేమో?"అన్నాడు సెక్యూరిటీ ఆఫీసరు.

"ఈ రోజు ఉదయానే ఆయన వచ్చి వెళ్లాడు. సేవ రెండు జేమ్సు ఇన్నిసు ఇద్దరూ వారి వెంబడి ఉన్నారు. విల్సను అక్కడఉన్న వారితో చాలాసేపు మాట్లాడాడు. ఇకచూచుకో రేపో, యెల్లుండో అక్కడ దాడి జరుగుతుంది. పందెము కడ తావా?" అని మార్షలు అన్నాడు.

పందెము కట్టిఉన్నట్లయితే మార్షలు గెలిచేవాడు. మూడోనాటి రాత్రి వెస్టన్ డౌన్సులో ఉన్న బూటకపు ఆయుధాగారముమీాద తీవ్రమైన విమాన దాడిజరిగింది.

"అయితే మిస్టర్ విల్సనుగారిని అరెస్టుచేస్తారా ? " అని ఆ సెక్యూరిటీ ఆఫీసరు మార్షలును అడిగాడు.

"చేయను. ఒకడు గూఢచారి వృత్తికి దిగాడంటే వాడి కేదో పెద్ద ఆశ ఒకటి ఉండాలి. ధనమా ? విల్సనును కోటీ శ్వరులలో జమకట్టవచ్చును. దేశభక్తి అనుకొందామా ఆయన

తాత పోలెండులో ఒక యూదుడు. అటువంటి వాడికి హిట్లరు మీద అభిమానము ఎందుకుంటుంది? విల్సను నిజంగా చాలా పెద్దమనిషి. ధర్మాత్ముడు. ఆతడు తప్పుదోవకు పోయేవాడు కాడు." అని మార్షలు అన్నాడు.

"అయితే మరిఎవ్వరు?"

"మనము నేర్చుకొన్న సూత్రాలు దృష్టికి తెచ్చుకో! అందులో ఒకటి ఏమిటంటే 'ఆదాయన్ని అతిక్రమించి జీవించే వాణ్ణి వెదకి పట్టుకో' అని."

''ఇంకొకరు ఎవరికి తెలుసు? బహుశః జేమ్సు కాడను కొంటాను."

''జేమ్సుకూడా కాదు. ఆయన పూర్వచరిత్రంకూడా సంతృప్తిగానే ఉన్నది. కాని ఆదాయానికి సంబంధములేకుండా డబ్బును విచ్చలవిడిగా వాడుతూన్న వాణ్ణి మా మూలు చమారాకోనే నేను కనిపెట్టాను. ఇదిగో ఇప్పుడే విల్సను ప్రయివేటు సెక్రటరీ ఇన్నీసును ఆరెస్టు చేస్తాను.''

# 6

అందరిలోకి గమ్మత్తయిన గూఢచారి ఒక బెల్జియను దేశస్థుడు. వాడిలోఉన్న తమాషా ఏమిటంటే తాను గూఢ చారి అనేసంగతి వాడికే తెలియదు.

గత యుద్ధంలో లిల్లీ (ఉత్తర ఫ్రాన్సులో ఒక పట్టణము)లో ఉండే "లూయీ బెట్టిని" అనే పేరుగల ఒక పంతులమ్మ బ్రిటిషువారి తరఫున గూఢచారుల సంఘాన్ని ఒకటి ఏర్పాటు చేసింది. వారు జర్మను సైన్యాల రవాణాలను గురించీ యితర ముఖ్యవిషయాలను గురించీ ఆమెకు తెలియచేస్తూ ఉండేవారు. గూఢచారి వృత్తిలోగల గొప్పకష్టము వార్తా సేకరణలో ఉండదు. ఆ వార్తలను యథాస్థానాలకు అందివ్వడములో ఉంటుంది.

ఆసమయంలో హాలెండు తటస్థరాజ్యము. అక్కడ బ్రిటిషు 'ఇంటెలిజన్సు' శాఖవారు పనిచేస్తూనే ఉన్నారుగాని సరిహద్దు ప్రాంతాలలో ముండ్లతీగలు – ఎలక్ట్రికు కంచెలు – సెర్చిలైట్లు–మిషనుగన్లు, కాపలాదారులు–ఇంత హంగామా పెట్టి వాళ్ళను అటూ యిటూ మెసలకుండా చేశారు. కాని వార్తలు నడుస్తూనే ఉండేవి.

ఉత్తర బెల్జియములోఉన్న "టరన్‌హౌటు" అనే పట్టణసమీపంలో నివసిస్తూ ఉన్న ఒక స్త్రీ దీనికి కీలక పాత్రము. ఆమెపేరు "డ్యూపాంటు" అని అనుకొందాము. ఇది ఆమె నిజమైన పేరుకాదు. ఆమె యింకా బెల్జియములో బ్రతికి ఉండవచ్చు.

మ్యానాంటు నిర్వహించవలసిన బాధ్యత చాలా ప్రాణా పాయ కరమైనటువంటిది. ఆమె పశ్చిమవారి సరిహద్దులలో గుండా వార్తలను గాని, వార్తా వాహకులనుగాని తెప్పించు కోవలసి వచ్చేది. ఆమె ధైర్యాన్ని, యుక్తినీ గురించిన సంగ తులు వింటుంటే కల్పితకథలు కూడా చాలా పేలవంగా కన బడతెవి.

ఆమెదగ్గర ఒకతోట మాలి ఉన్నాడు. వాణ్ణి యుద్ధ ఖైదీగా పట్టుకొని పోయినారు. వాడికి బదులుగా పనిచేయు డానికి ఆమెకు హారిను అనేపేరుగల ఒక వెట్టిబాగులవాడు దొరికాడు. వాడు ఇరవై అయిదేండ్లవాడు, ఒడ్డూ, పొడుగూ, మంచి బలిష్ఠమైన శరీరము గలవాడు. కాని నాడి మన స్తత్వము ఆరేండ్ల బాలునివంటిది. ఆ గ్రామంలోకున్న సరి హద్దు ప్రాంతపు జర్మను కాపలా దారులకు వీడిమీద మోజు కలిగింది. వీడిని దగ్గరకు చేరదీసి బిస్కట్లూ, సిగిరెట్లూ యిచ్చి వీడి కబుర్లు వింటూ మధ్య మధ్య ఏడిపిస్తూ నవ్వుకొంటూ ఉండేవారు. దీనిని గమనించిన మ్యానాంటుకు ఒక ఆలోచన కలిగింది.

సరిహద్దుకు కొంచెము అవతలగా "బాగ్లేడకుక్" అనే గ్రామము ఉన్నది. అది బెల్జియను గ్రామమేకాని చుట్టూ పశ్చిమవారి పరగణా ఉన్నది. ఇక్కడ బ్రిటిషూ, ఫ్రెంచి ఇంటెలిజన్సు ఆఫీసర్లు తమ ఏజంట్లకోసము నిరీక్షిస్తూ ఉం టారు. జర్మను కాపలాదారులు ఆ గ్రామంలోకి అడుగు పెట్ట డానికి వీల్లేదు. అట్లాచేస్తే హాలెండుయొక్క తటస్థభావాన్ని అగౌరవపరచినట్లవుతుంది.

ఈ సరిహద్దులలోకూడా కాపలా చాలా జాగ్రత్తగా

జరుగుతూన్నది. ఒకనాడు డ్యూపాంటు ఏజంటు ఒకడు సరి హద్దుదాటి రావడానికి ప్రియత్నము చేశాడు. వాడుఒక రైతు. బండినిండాఎండుగడ్డి వేసుకొని వస్తున్నాడు. ఆగడ్డికింద ఒక బ్రిటిషు గూఢచారి దాక్కొని ఉన్నాడు.

డ్యూపాంటు ఈ గడ్డిబండిని దూరాన్నుంచి కనిపెడు తూనే ఉన్నది. జర్మనుల దృష్టిఅంతా గడ్డిమీదనే ఉన్నట్లు ఆమె గమనించింది. తత్క్షణమే వెళ్ళి ఆ జర్మను లున్నచోటికి హారినును పంపించింది. హారిను పిచ్చిపాటలు పాడుకొంటూ వాళ్ళదగ్గరకు వెళ్లాడు. వీడినిచూడగానే వాళ్ళదృష్టి వీడి మీదికి మళ్ళింది. ఆమోటు సైనికులకు ఈ మొద్దు అబ్బాయి చేష్టలు బలే మనోరంజకంగాఉండేవి. ఆ నవ్వులాట ధోరణిలోబడి ఈ గడ్డిబండిని పోమ్మన్నారు. ఆ బ్రిటిషు గూఢ చారి సురక్షితంగా గమ్యస్థానము చేరుకొన్నాడు.

అప్పటినుండి హారిను బాగా పనికివచ్చాడు. వాడు చేస్తున్నదేమిటో వాడికే తెలియదు. పైగా వాడికి ఏమీ రహస్యము నమ్మి చెప్పడానికి వీలులేదు. ఒక దఫా "నా క్రొత్త కోటును చూడండి" అని దర్పంగా పోయి ఆ జర్మనుల ముందర టంచనుగా నిలబడ్డాడు.

నిజానికి అది డ్యూపాంటు వాడికి ఇచ్చిన ఒక పాత కోటు.

"ఓహో! బలే బాగా ఉన్నదే! దీనికొక ప్యాసురాసి యిస్తాను. బార్లే డక్కులోఉన్న మీ అత్తగారికి చూపించి రా! అని ఆ జర్మనులలో ఒకడన్నాడు.

ఆ మాటలు అంటూనే ఒక కాగితపు ముక్కమీద కొన్ని అక్షరాలురాసి దాన్ని హారిను తొడుక్కున్న కోటుకు

వీపున గుండుసూదితో గుచ్చాడు. హారిను దర్జాగా మిలిటరీ ఉద్యోగస్థుడిలాగా రొమ్ము విరుచుకొని చేతులు ఊపుకొంటూ వెనక్కు తిరిగిచూడకుండా గ్రామమువైపు వెళ్ళాడు. వాడి వీపున ఉన్న కాగితముమీద "వెల-1 ఫ్రాంకు 95 సెంటైమ్సు" అన్నమాటలు చూచి జర్మనులందరూ విరగబడి నవ్వారు.

బార్లే డక్కు-గ్రామం చేరగానే హారిను తొడుక్కొని వచ్చిన కోటు లైనింగులలోనుంచి వాడిఅత్తగారు కొన్ని కాగితాలను బైటికి తీసింది. జర్మనుల సైనిక స్థావరాలు, మరఫిరంగుల ప్రదేశాలు మొదలైన వివరాలెన్నో వానిలో ఉన్నవి.

హారినుకు తోడు ఒక కుక్క-గూడా ఉన్నది. అది ఎండకు ఎండి గాలికి పెరుగుతూ ఉన్నది. దానికి ఒంటినిండా తగని బొచ్చు. ఏనాడూ దానికి నీళ్ళుపోసి బ్రష్‌చేయక పోవడంవల్ల ఆ బొచ్చంతా అంటలు గట్టుకు పోయింది. ఆ కుక్క-ను చూచే టప్పటికి డ్యూపాంటుకు ఇంకొక ఆలోచన తట్టింది. సిగిరెట్లు చేసే ఉలిపిరి కాగితము ముక్క-లమీద సమాచారాలు రాసి ఉండలుచుట్టి ఆ కుక్క-బొచ్చులో పడిపోకుండా పదిలంగా పెట్టేది. హారినుతోపాటు కుక్క-గూడా అత్తగారింటికిపోతూ వస్తూఉండేది. అప్పుడప్పుడు హారిను ఆ జర్మను కాపలాదారుల ముందర ఆగి తన కుక్క-చేత సర్కసు పనులుకూడా చేయించే వాడు.

ఒకనాడు ఆ కుక్క- కొంపతీయడానికి తయారైంది. ఒక రహస్యవార్తగల కాగితము ఉండ దాని పొట్టకింద బొచ్చులో ఉన్నది. సరిహద్దుగల ఠాణాకు చేరేటప్పటికి దానికి శివము పెరిగింది. కారణము ఏమిటంటే కొత్తగావచ్చిన ఒక జర్మను కాపలావాడు తాను పెంచుతున్న ఆడకుక్క-ను వెంట తీసికొని

వచ్చాడు. దాన్ని చూడగానే దీనికి తెగులు పుట్టింది. తను చేయవలసిన పని ఏమిటో మరచిపోయి దాని వెంబడిపడ్డది.

డ్యూపాంటు గొప్ప యుక్తిశాలిని. ఎంత నవీన పద్ధతే గాని పోయిన పోడుగునా అవలంబించేది కాదు. మూడునాలుగు రోజులకు ఆ తరహా మారుస్తూఉండేది. కొన్ని వారాలపర్యంతము హారినును ఉపయోగించుకొనేదే కాదు. అయినప్పటికి ఎవరికి అనుమానము లేకుండా ఉండేలాగున వాణ్ణి అత్తగారిని చూడడానికి పంపుతూనే ఉండేది. వాడివి మామూలు రాకపోకలేయని అందరూ భావించేటట్లు చేసింది.

ఈ పద్ధతి చాలా బాగా నెగ్గింది. ఒకసారి ఆఠాణాకు తనిఖీ ఉద్యోగి ఒకడు వచ్చాడు. ఆరోజున వచ్చేపోయే వారందరినీ సాంగంగా పరీక్ష చేశారు. హారినునుకూడా వదలిపెట్ట లేదు. హారిను దిగంబరుడై నిలుచున్నాడుగాని అదేమిటో ఎందుకు అట్లా చేస్తున్నారో వాడికేమి అర్థము కాలేదు.

హారినునువదలి తనిఖీ ఉద్యోగస్థుడు వెళ్ళిపోగానే ఒక జర్మను స్నేహితుడికి ఒక తమాషా ఊహ తట్టింది. వాడు వెంటనే హారిను ఛాతీమీద రంగులతో ఒక గద్ద బొమ్మను గీశాడు. హారిను వెంటనే పరుగెత్తుకొంటూ వెళ్ళి తన చొక్కా తీసి గద్దబొమ్మను డ్యూపాంటుకు చూపించాడు.

మళ్ళీ వాడు సరిహద్దుఠాణాను దాటేటప్పుడు తన ఛాతీమీదఉన్న గద్దబొమ్మను వాళ్ళందరికీ చూపించాడు. వాళ్ళందరూ విరగబడి నవ్వారు.

ఆ గద్దబొమ్మలో ఒకరెక్కకు మూడుపూతల రంగులు ఉన్నవి. మొదటిది నలుపు. దానిపైన సెల్యూలాయిడు కాగి

తనుమీద సన్నగా సూదితో చెక్కబడిన అక్షరాలతో ఒక వార్త. అది చర్మానికి అంటుకొని ఉన్నది. దానిపైన మళ్ళీ నల్లటిరంగు.

హారిను చర్యలన్నింటిలోకి వాడి గాలిపటము చాలా సహాయముచేసింది. హారినుది ఒక పసిపిల్లవాని మనస్తత్వము లాంటిది అని యిదివరకే చెప్పుకొన్నాము. వాడు పది పన్నెండేండ్ల ఈడుగల పిల్లకాయలతో కలిసి హుషారుగా అరచుకొంటూ పొలాలలో ఎండాకాలపుగాడ్పులలో గాలిపటాలు ఎగరవేసుకొనేవాడు.

డ్యూపాంటు వాడికి చాలా సహాయము చేసేది. వాడి గాలిపటానికి ప్రత్యేకంగా ఒక తోక తయారుచేసి అతికించేది. కావలసిన దారము కొనిపెట్టేది. పొలాలలో తినడానికి బిస్కట్లు యిచ్చేది. ఇవన్నీ ఇచ్చి ఆడుకోరా నాయనా అని వాణ్ని పంపేది.

వాడి గాలిపటము బాగా పైకి ఎగిరిన తరువాత గాలికి బరువుఎక్కువై దానికి కట్టినదారము కాస్తా తెగిపోయేది. ఆ గాలిపటము గాలివాలునబడి సరిహద్దులన్నీదాటి దాదాపు ఒక మైలుదూరముదాకా కొట్టుకుపోయేది, గాలిపటము పోయినందుకు హారిను లబలబలాడుతు పిల్లవాడికిమల్లే ఏడ్చేవాడు. వాడిఏడ్పుచూసి అక్కడ కాపలాఉన్న జర్మను సైనికులు వాడికి పిప్పరమెంట్లుపెట్టి ఓదార్చేవారు.

సరిహద్దులలోఉన్న ఎలక్ట్రికు కంచెలు, మినుగనులు, ముండ్లతీగలకు అవతలవైపున ఒక బ్రిటిషు ఇంటెలిజన్సు ఆఫీసు గాలికి కొట్టుకుపోతూన్న ఆ గాలిపటము వెంబడిబడి ఆఖ

రుకు పట్టుకొనేవాడు. ఆతనికి కావలసింది ఆ గాలిపటము తోక మాత్రమే. పైకి అది పాత వార్తాపత్రికల ముక్కలవలె కన బడుతున్నప్పటికీ దానిని ఎట్లాగా కాల్చిన యినపకడ్డీతో వేడి చేయడంవల్ల అక్షరాలు బైటపడేవి. చదువుకొంటే అమూల్యా ములైన సమాచారాలు తెలిసేవి.

యుద్ధము ఆఖరుకాబోయేముందు హారిను వార్తలను సేకరిస్తూ ఉండేవాడు. ఖైరవేస్తూ ఉండేవాడు. జర్మనులు వాణ్ణి ఒక జడపదార్థముకింద జమకట్టి ఏమీ దాపరికము లేకుండా మాటలాడుకొనేవారు. వాడు విన్నవానిని గురించి చెప్ప డానికి డ్యూపాంటు ఎంతో ఓపికతో ప్రశ్నలువేస్తూ అడుగు తూండేది. కొన్నిగంటలు వృథాచేసుకొన్నా ఒక విషయమూ తెలిసేదికాదు. ఒకప్పుడు వీటన్నిటికి తగిన ఫలితముకూడా లభించేది.

బాస్లేడకుక్ గ్రామందగ్గర తమకు ఎంతో వినోదాన్ని సమకూర్చిన హారినును చాలామంది జర్మను సైనికులు జ్ఞాప కము ఉంచుకొన్నారు. ఆ గ్రామానికి సంబంధించి యింకా కొన్ని తమాషాలు జరిగినవి. తప్పుడు పుకార్లు పుట్టించడానికీ మంచి తరుణంలో దొంగ వృత్తరువులిచ్చి మోసగించడానికీ యుద్ధానికి పూర్వమే జర్మనీవారు తమ ఏజంటును ఒకడిని ఇక్కడ పెట్టుకొన్నారు. వాడు ఉండీ ఉండీ ఆ గ్రామమంతా జర్మను ఏజంట్లతో నిండిపోయిందని ప్రచారము సాగించాడు. ఒక బెల్జియను మిలిటరీ ఆఫీసరు ఈ విషయంలో చాలా తీవ్ర మైన చర్య తీసుకొన్నాడు. ఆ జర్మను ఏజంటునే పట్టుకొని కాల్పించాడు.

రహస్యచర్య వింత పోకడలతో ఖదమునడక నడిచింది

ఈ గ్రామంలో, ఒకసారి ఒక శవమును డచ్చి సరిహద్దులను దాటించి తీసికొనివెళ్లారు. అది ఆ గ్రామంలో ఉండే ఒక ముసలికాపుడు. దాన్ని జర్మను సైనికులు గౌరవంగా పోనిచ్చారు. మరుసటి వారములో మళ్ళీ ఒక శవము. వార్తలు నడుస్తూనే ఉన్నవి. జర్మనులు గాభరాపడి పోయినారు. మూడో శవము వచ్చింది. దానిని డాక్టరు పరీక్ష చేస్తేనేకాని పోనివ్వడానికి వీలులేదన్నారు. డాక్టరువచ్చి పరీక్షచేశాడు. ఆశవముగొంతులో వాటరుప్రూఫ్ సిల్కులో చుట్టబడిన ఒక కాగితము ఉన్నది. ఆ కాగితముమీద వైప్రెస్ దగ్గర జర్మనుల ఆయుధ సామగ్రి స్థావరాలయొక్క వివరాలన్నీ విరళంగా వ్రాయబడి ఉన్నవి.

జర్మనులు పూనుకొన్న రహస్య శాఖను గూర్చిన ఒక పెద్ద స్కీము ఒకటి పుబ్బలోపుట్టి మఖలో మాడిపోయింది. గూఢచారుల శిక్షణకై ఒక పాఠశాలను ఆంట్వెర్పు పట్టణంలో స్థాపించారు. దానిని ప్రారంభించిన కొద్దిరోజులలోనే దానిక సంబంధించిన వారందరూ అరెస్టు చేయబడ్డారు.

ఏలాగంటే, గోలీలు ఆడుకొనే చిన్నకుఱ్ఱవాడు దానికి కారణభూతుడు. వాడిచేతికి ఒక బొమ్మ గడియారము ఉన్నది అది నిజానికి ఒక సున్నితమైన కెమేరా. వాడు ఆ కెమేరాతో ఆ పాఠశాలకు వచ్చే పోయే వాళ్ళందరివీ ఫోటోలు తీశాడు. దానితో వాళ్ళ ఆటకట్టింది.

అందరికంటె విచిత్రమైన గూఢచారి టర్కీ వెళ్ళిన హిట్లరు రాయబారి వాన్ పేపన్. తన గూఢచారి వృత్తిలో అతడు రెండు మూడు పర్యాయములు పారిపోవలసి వచ్చింది.

అట్లా పారిపోయినప్పుడల్లా తన దగ్గర ఉన్న కాగితాలు వెంట తీసుకొని పోవడము మరిచిపోయేవాడు. బ్రిటిషువారి రహస్య శాఖకు ఇంతకంటె మహోపకారముచేసినవాడు మరొకడు లేడు.

## 7

బ్రిటిషు గూఢచారులలో ఒక విశిష్టత ఉన్నది. జర్మనీ గూఢచారులు ఏవిధంగా శిక్షణ పొందినదీ వారి గుట్టు మట్టులన్నీ బ్రిటిషు గూఢచారులకు బాగా తెలుసు.

జర్మనీవారు తమ గూఢచారుల కిచ్చే శిక్షణ ఎంతటి అసమగ్రమైనదీ ఇందులో చెప్పబడే కారల్ వర్ఫెల్ అనేవాడి కథనుబట్టి తెలుసుకోవచ్చు.

కారల్ వర్ఫెల్ ఒక పెద్ద మేధావికాడు. నిజానికి జర్మనీ గూఢచారులలో గొప్పగా చెప్పుకోదగిన మేధావు లెవ్వరూ లేరు. వారందరూ చాలావరకు నేరస్థుల జాబితాలలో నుంచి ఏరుకోబడినవారు. వారికి ప్రతిఫలము పుష్కలంగా ఉండే టట్లయితే ఎటువంటి అపాయాలకైనా సిద్ధపడతారు. వర్ఫెల్ ఒకపిల్లనుగురించి జెయిలుకు పోయి, పోలీసు రికార్డులలో పేరు గలవాడే. అతడు ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు బాగానే మాట లాడేవాడు. అతనికి శిక్షణ యిచ్చిన ఉపాధ్యాయుడు వెంటనే అతనిని ఒక పనికి నియోగించాడు.

"నీవు ఇంగ్లాండుకు పోవాలి. నావికాబలముల సంచార మును గురించి మనకు సమాచారాలు బహు తక్కువగా వస్తున్నవి. యుద్ధంలో విజయంకోసము మనం, యూ బోట్లమీద ఎక్కువగా ఆధారపడి ఉన్నాము. నీవు ఒక బెల్జియము నావి

కునివలె నటించాలి. అప్పుడు నీవు మాట్లాడే ఫ్రెంచిలో ఉన్న లోపాలు అన్నీ సమసిపోతవి. ఒకప్పుడు నీవుకూడా ఒక నావికా బలమును సహాయముకొరకు వెంబడించే కాన్వాయ్‌తో కలిసి వెళ్ళవలసివస్తుంది. కొన్ని కొన్ని అపాయాలను ఎదుర్కొనక తప్పదు. మంచిది. నీవే దీనికి తగినవాడవు. ముందుగా గూఢచారుల పాఠశాలకు వెళ్ళు. ఇదీ దాని అడ్రసు. అక్కడికి వెళ్ళిన తరువాత నీపేరు మరచిపో. అప్పటి నుండి నీవు నెంబరు 34."

ఆ పాఠశాల ఒక పెద్ద బ్రహ్మాండమైన భవనము కాదు. బెర్లిన్ నగరము వెలుపల ఒక భాగ్యవంతుడు వదలి పెట్టి పోయినయింట్లో ఉన్నది. వర్నెల్ స్కూలు ముందర దిగగానే దాని డైరెక్టరు వచ్చి, అతణ్ణి కలుసుకొని లోపలికి తీసికొని వెళ్ళాడు. అతణ్ణి నెంబరుతోనే పిలిచాడు. అతనికి ఏకాంతవాసము ఆదేశించాడు.

"నీవు ఇక్కడ ఉన్న ఇతరు లెవరితోనూ కలసి మెలసి తిరగకూడదు. ముందు ముందు వాళ్ళు ఎప్పుడైనా నిన్ను బైటపెట్టగలరు." అని.

అతనికి శిక్షణ ప్రారంభమైనది. నెంబరు 34 మార్సు అక్షర సమామ్నాయము నేర్చుకోవాలి. రేడియోలో ఉన్న రహస్యాలు తెలుసుకోవాలి. వాడుక భాషలోగల వివిధ రీతులు అర్థము చేసుకోవాలి. గూఢచారి వృత్తిలో ఉన్న ఎన్నో మెళుకువలు గ్రాహ్యములు కావాలి.

ఇవన్నీ నేర్చుకోవడము సులభముకాదు. అతడు చాలా కష్టపడవలసి వచ్చింది. సినిమాలో గూఢచారులు సరాసరి

పనిలోకి దూకుతారు. వాస్తవికప్రపంచములో చచ్చేటంత కఠినశిక్ష పొందవలసి ఉన్నది. లేకపోతే తాను చేయవలసిన పనిఏమిటో తెలుసుకోలేడు.

వ్యావహారిక భాషాశిక్షణ చాలా ఉత్సాహకరంగా ఉన్నది. కాని రేడియో ప్రాణాలు తోడేసింది. అందులో శిక్షణ ఆమూలాగ్రంగానూ అందరికీ అర్థము అయ్యేటట్టుగానే ఉన్నది. రేడియో ఉపాధ్యాయుడు ఇంగిల్‌మాన్ అనే పేరు కలవాడు ఇట్లా అన్నాడు.

"ఇది చాలా సులభమైన పని. నీవు ఇంగ్లాండుకు వెళ్ళగానే "బ్రాంకో" అనే పేరుగల రేడియోసెట్టును కొనుక్కో! ఇది ఒక జర్మను-అమెరికను కంపెనివారిచేత అమెరికాలో తయారుచేయబడ్డది దీనిలో ప్రత్యేకత ఏమిటంటే—ఇది సులభంగా ట్రాన్సుమిటరుగా మార్చుకోవడానికి అనుగుణంగా ఉండేటట్లు నిర్మాణము కాబడినది. ఇప్పటికింకా "బ్రాంకో"లు ఇంగ్లాండులో దొరుకుతున్నవి. మార్పు చేసుకోవడానికి కావలసిన సామగ్రి యిది. ఈ జాబితా కంఠతాపెట్టు. ఇవికూడా అన్ని షాపుల్లోను దొరుకుతవి. వీటి మూలమున "బ్రాంకో" "రిసీవింగు" సెట్టును "ట్రాన్సుమిటింగు" సెట్టుగా తయారు చేసుకోవచ్చు."

ఇంగిల్‌మాన్ "బ్రాంకో" ఒకదానిని తెప్పించి ప్రత్యేకంగా మార్పుచేసి చూపించాడు. అది ప్రత్యేకంగా దీనికోసమే తయారు కాబడినటువంటిది. ఇంగిల్‌మాన్‌కు ఆపనిలో మంచి అనుభవముకూడా ఉన్నది. విశేషించి ఆ సెట్టు తయారయ్యే ఫ్యాక్టరీలో అతడు కొంతకాలము పనిచేశాడు.

"కాని, జర్మనీకి సరాసరి వర్తమానాలు పంపడానికి వీలుపడదు గదా!'' అని వర్ఫెల్ ప్రశ్నించాడు.

"అవును. ఈ వాల్వులు యాభై మైళ్లవరకే పనిచేస్తవి. అడిచాలు. ఎందుకంటే. నీవు సామాన్యంగా ఏదో [illegible] తీర పట్టణంలోనే ఉంటావు. సముద్రంలో ఉన్న ఒక యూ-బోటుకు గాని, పైన తిరిగే విమానానికి గాని నీవు సమాచారాలు అంద జేయవచ్చు. నీవు వైర్లెస్ ఎక్కడ ఉపయోగిస్తావో, ఎప్పుడు ఉపయోగిస్తావో మట్టుకు జాగ్రత్త! ఎందుకంటే [illegible] సుల భంగా పట్టుబడిపోతావు. ఒక్కచోటినుంచే రెండుసార్లు ఉప యోగించబోకు" అని ఆయన చెప్పాడు.

ఇవన్నీ గాక హెర్ వోగెల్ అనే ఆయనదగ్గర వర్ఫెల్ రోజుకు కొన్నిగంటలు ప్రాక్టికల్ కోర్సు చదువుకొనేవాడు. హెర్ వోగెల్ ఈ గూఢచారివృత్తిలో అసాధారణ ప్రజ్ఞాశాలి. ఆయన ఎన్నో ఘనకార్యాలు చేశాడు. అటువంటి శేముషీ దురంధరుడు కావడంవల్లనే ఆయనకు ఆచార్యపీఠము దొరికింది. సూటిగా అవలంబించవలసిన పద్ధతులను గురించి వోగెల్ బహు చక్కగా వివరించి చెప్పాడు. సినిమాలో చూచినదంతా మరిచి పొమ్మన్నాడు. "ఫిల్ము చూచినప్పుడు కలిగే భావోద్వేగాలూ అద్భుత భయానక భీభత్స దృశ్యాలూ బాహ్యలోకంలో ఉండవు. ప్రపంచంలో ఉన్న గొప్పగొప్ప గూఢచారులు రసపిపాసగాని, ఉత్సాహ ఉద్రేకాలుగాని ఎఱుగరు. ఇతరులు మాటలాడు కొనే మాటలు వింటూ శాంతంగా తనకు కావలసిన ముఖ్య విషయాలు ఎన్నో సేకరించవచ్చును." మళ్ళీ కొంతసేపటికి ఆయన ఇట్లా అన్నాడు.

"ఫిల్ములలో చూచినటిక్కులు చేయాలనుకొంటా వేమో జాగ్రత్త ! నౌకాశాఖ కార్యాలయంలోని యినప పెట్టె బద్దలుకొట్టి అందులోఉన్న ప్లానులు ఎత్తుకొని రావడము కాదు నీపని. అది నీవల్ల ఎన్నటికి అయ్యేపనికాదు. తెలిసిన సమాచారాలన్నీ చిన్న చిన్న ముక్కలకింద సమకూర్చుకొని, విషయమంతా సమగ్రంగా తెలుసుకోవాలి. ఒకప్పుడు కొన్ని ముక్కలు సరిపోతవి. కొన్నిముక్కలు సరిపోవు. ఎంతో ఓపి కతో పనిచేయాలి. తెలిసిన సమాచారము నిజమెంతో అబద్ధ మెంతో విచారణచేసి తెలుసుకోవాలి. ఉత్తరపుకార్లను నమ్మ గూడదు. బ్రిటిషువారికి అజాగ్రత, అతివాగుడు అలవాటు. అందుచేత నీకు అపాయమేమీ లేకుండా వారి మాటల ధోర ణిలో నీకు కావలసిన విషయాలన్నీ సులభంగా తెలుస్తూనే ఉంటవి. నీవు బహిరంగంగా ఏమీ నోటుబుక్కులో వ్రాసుకో గూడదు. కోటు జేబుల్లోకి చేతులను పోనిచ్చి, కుడిచేతులో చిన్న పెన్సిలుముక్కతో జేబులో ఉన్న కాగితముమీద బైటికి తీయకుండా వ్రాసుకోవాలి. 25 పడవలు ప్రయాణం చేయ బోతున్నవని తెలిస్తే ఆనాటి ఖర్చు 25 షిల్లింగులు అని వ్రాయాలి.

ప్రచ్ఛన్న భాషలు, గుఱుతులు గుఱించిన ఒక ప్రత్యేక తరగతి ఉన్నది. అటువంటిదే కానరాని సిరాలను గుఱించినది. ఎటువంటి విరుగుళ్ళకూ లొంగని సిరాలను చేయడానికి కావలసిన కెమికల్సు, వాటిని చేసేపద్ధతులు కంఠస్థము చేసుకోవాలి. వాటిని మామూలు సిరాల మోస్తరుగా ఒక బుడ్డిలో పోసు కొని తీసికొనిపోవడానికి వీలులేదు. కాబట్టి ఒక జేబురుమాలను ఆ సిరాలో కొంతసేపు నానవేసి, ఎండబెట్టి, దగ్గర ఉంచు

కోవాలి. సిరా కావలసినప్పుడు వేడినీళ్లలో దానిని ముంచితే సిరా తయారవుతుంది.''

వివిధ రీతుల సంభాషణలలో ఎక్కడ ఏరీతిగా దానిని నిర్వహించవలసినది ఇత్యాదులు వోగెలు వివరించి చెప్పాడు. కొన్ని స్వల్పవిషయాలు ఉపేక్షించినందువల్ల కొందరు ఏరీతిగా పట్టుబడ్డారో చెప్పాడు.

''ఒకడు సైకిలు దొంగిలించాడు. రోడ్డుకు కుడిప్రక్కన తొక్కుకుంటూ పోతూండడమువల్ల పట్టుబడ్డాడు. ఒకడు ఏడు అంకెను జర్మనీవాళ్లు వ్రాసేవిధంగా వ్రాసి పట్టుబడ్డాడు. ఇటు వంటివి జాగ్రత్తగా చూడమని బ్రిటీషు పోలీసులకు నూరి పోస్తారు. నీవు బెల్జియను దేశస్థుడవుగా నటించడమువల్ల యీలోపాలన్నీ చాలా వరకు సర్దుకుపోతవి. నీవు ఒక మామూలు పెద్దమనిషివలె చాలా శాంతంగా సంచరించాలి. పోష్టుఆఫీసులో సేవింగ్సు బ్యాంకు అకౌంటు ఒకటి పెట్టుకోవడము చాలా మంచిపని. అది గౌరవప్రతిష్ఠలకు నిదర్శనంగా ఉంటుంది.''

వర్ఫెల్ విద్యాపరిశ్రమ పరిసమాప్తి అయింది. గూఢ చర్యలలో పట్టభద్రుడైనాడు. ఒక మోటారు బోటు తీసుకొని బెల్జియను రేవునుండి జర్మనీవారి చేతుల్లోనుంచి తప్పించుకొని వచ్చినవానివలె ఇంగ్లాండుకు చేరుకున్నాడు.

ఇంగ్లాండులో అడుగుపెట్టగానే అతనిని బాగా పరీక్ష చేశారు. అతనిని గుఱించిన కాగితాలన్నీ సరిగానే ఉన్నవి. అతడు వ్యాపార నౌకలలో ఉద్యోగానికి అర్జీలు పెట్టుకున్నాడు. కొన్నాళ్ళకు అతనికి నార్తుపోర్టు అనే రేవునద్ద తాను ఉద్యోగము చేయవలసిన నౌక రాకకోసము నిరీక్షించి ఉండమని

ఆర్డరు వచ్చింది.

ఆరంభంలో విశేషాలేవీ లేకుండానే గడచిపోయింది. అతనికి కొంతభయం వల్లనూ, దౌర్బల్యంవల్లనూ ఏమి చేయడానికి తోచేదికాదు. చావు తప్పించుకొని వచ్చినవాడు ఆ మోస్తరుగా ఉండడము సహజంగానే కనిపించింది. "మర్చెంటు నేవీక్లబ్బులో"చేరే తోడి ఉద్యోగస్థులు అతనంటే ఆదరణగా చూసేవారు.

అతనికి ధైర్యము కలిగింది. రేవులో సమ్మర్దము మహాజాస్తిగా ఉండేది. నిజమైన సమాచారము తెలియడము దుష్కరమై పోయింది. దినాన లోడింగు జరుగుతుండే ఓడలను చూస్తే కాన్వాయ్ తయారవుతున్నదా అన్నట్లు కనబడేది. కాని, తక్కిన వివరాలేమీ తెలిసేవికావు.

వర్ఫెల్ హతాశుడయ్యే స్థితిలో ఉండగా వోగెలు ఇచ్చిన శిక్షణ అక్కరకు వచ్చింది. ఒకసాయంకాలం ఒక హోటలులో అతినికిన కావలసి సమాచారాన్ని గురించి రెండు ముక్కలు తెలిసినవి.

ఇద్దరు నావికులు వర్ఫెల్ బెల్జియము నుండి పారిపోయి వచ్చినవాడని తెలుసుకొని త్రాగడానికి దగ్గరవున్న హోటలుకు తీసుకొని పోయినారు. ఆ సందర్భంలో వాళ్ళు మాట్లాడు కొన్న సంగతులను బట్టి ఒక కాన్వాయ్ రష్యాకు బయలుదేరి పోతూన్నదని తెలిసింది.

ఆ నావికులు వెళ్ళిపోయినారు. వర్ఫెల్ అక్కడే కూర్చొని పక్క టేబిలుదగ్గర జరిగే సంభాషణ విన్నాడు. వాళ్లు ఫుట్ బాలు పందెములను గురించి బిగ్గరగా మాట్లాడు

కొంటున్నారు. "ఒరే! బిల్లూ! రేపుపోటీ ఎవరెవరికి?" అని ఒక డడిగాడు.

"నారు పోర్టువారికీ,| మాంచెస్టరు యునైటెడ్ వారికి. కాని, నేను రావడానికి వీలుపడదు: సోమవారములోగా లోడింగు పూర్తికావాలి."

వర్ఫెలుకు ఒంట్లో విద్యుత్తు ప్రవేశించి నట్లయింది. ఇన్నాళ్ళకు అతనికి కావలసిన సరియైన సమాచారము తెలిసింది. బ్రిటీషు కాన్వాయ్ ఒకటి సోమవారమునాడు రష్యాకు బయలుదేర బోతున్నది. ఈ వార్త జర్మనీవారికి చేర్చాలి.

వెంటనే అతడు తన బసకు పరుగెత్తాడు. అంధకారము అతని ఆవేశాన్ని కనబడనీయకుండా చేసింది.

"బ్రాంకో" రేడియో మిషను బైటికితీసి, ట్రాన్స్మిటరుగా మార్చాడు. పనిచేస్తున్నదా లేదా అని చూశాడు. అది మంచి స్థితిలోనే ఉన్నది. వర్ఫెల్ ఉద్రేకంతో ఉడుకెత్తి పోయినాడు.

ఇంతవరకు ఈ యితివృత్తము మామూలు ధోరణిలోనే నడిచింది. కాని, ఈ పట్టున కథఅడ్డంగా తిరిగింది. ఫిల్ములో జరిగే సంఘటన వంటిది నిజంగా జరిగింది.

తన "కోడు" నెంబరును దగ్గరలోఉన్న జలాంతర్గామికి కొట్టబోతూన్న సమయంలో అతడు ఉన్న గది తలుపులు తెరచుకొన్నవి. రివాల్వర్లు చేత పుచ్చుకొని యిద్దరు పోలీసు అధికార్లు వచ్చి అతనికి ఎదురుగా నిలువబడ్డారు. వర్ఫెలు నిశ్చేష్టుడై పోయినాడు. అతని కేసు విచారణచేసి మరణదండన విధించారు. అతడు అపీలు చేసినా లాభము లేకపోయింది. ఏమిటీ ఘోరము!

ఎట్లా జరిగింది? వర్షెల్ ఇంతవరకూ చేసిన పనేమీ లేదు. ప్రారంభములోనే పట్టుబడ్డాడు ప్రథమ కబళంలోనే మక్షికా పాత యోగం అతనికి ఎట్లా కలిగింది?

వాండ్సువర్త్ జెయిలులోని ఒక గదిలో వర్షెల్ కూర్చుని ఉన్నాడు. మరి ముప్ఫయి ఆరు గంటలలో అతనిని ఉరితీస్తారు.

ఒక బ్రిటిషు రహస్య శాఖాధికారి వర్షెల్‌ను చూడ డానికి వెళ్ళాడు. వర్షెలు అచ్చంగా జర్మనీదేశస్థుడు. కూలి కోసము వచ్చిన యితర దేశాలవాడు కాడు. దేశభక్తి ప్రేరే పింపగా ఇటువంటి ప్రాణా పాయకరమైన పనికి పూనుకొన్నా డని అందరు అభిప్రాయపడ్డారు. కాని, ఆ అభిప్రాయము సరి యైనదికాదు. అతడు ఎటువంటివాడైనా చావును నిరీక్షిస్తూన్న వాడిమీద సహజంగా అందరికి జాలి కలుగుతుంది.

వర్షెల్ ఏకాంతంగా ఉన్నాడు. ఆ బ్రిటిషు రహస్య శాఖాధికారిని చూడంగానే అతనితో మాటలాడవలెనని బుద్ధి పుట్టింది.

''నాకు గూఢచర్య నేర్పిన పాఠశాలలో శిక్షణ సమర్థ వంతమైనది కాదు.'' అన్నాడు వర్షెలు.

''నిజమే! అక్కడ తర్ఫీదుపొందిన వాళ్లలో చాలా మందిని మేము సునాయాసంగా పట్టుకొన్నాము. రహస్య శాఖలలో బ్రిటిషువారికీ, జర్మనీవారికీ చాలా తేడా ఉన్నది. జర్మనీవారు అసమగ్ర శిక్షణతో వందలమందిని అన్నిచోట్లా నియమిస్తారు. బ్రిటిషువారు సుశిక్షితులైన మహా మేధావు లను కొద్దిమందిని మాత్రమే నియోగిస్తారు''

''నాకు ఒక విషయము అర్థముకాకుండా తికమక పెడు

తున్నది. మీరు నన్ను ఎట్లా పట్టుకోగలిగారు? నైట్రెన్ ఉపయోగించడము అపాయకరమనే సంగతి నాకు తెలుసు. కాని నేను నోరెత్తి మాటలాడక పూర్వమే పట్టుకొన్నారు."

"అదా సంగతి! నిన్ను మేము కొన్ని నాళ్లనుంచి కని పెడుతూనే ఉన్నాము. మొదట్లో మేము నిన్ను అనుమానించ లేదు. కాని, ఎప్పుడైతే నీవు పోస్టు ఆఫీసులో సేవింగ్సు బ్యాంకు అకౌంటు ప్రారంభించావో అప్పటినుంచి నీవు ప్రతి క్షణమూ మాదృష్టిలోనే ఉన్నావు."

"ఏమిటీ ? నాకు అర్థంకావడము లేదు. గూఢచర్య పాఠశాలలో హెర్ వోగెలు పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులో లెక్క జమకట్టమని మరీమరీ చెప్పాడే !"

"అవును. అసలు రహస్యము నీకు ఇప్పుడు చెప్పడంలో అపాయ మేమీలేదు. ఎందుకంటే వోగెలు ఆ పాఠశాల విడిచి వెళ్లిపోయినాడు. వోగెలు ఎవరనుకొన్నావు ? జర్మనీ దేశంలోఉన్న ప్రతిభాశాలియైన ఒక బ్రిటిషు గూఢచారి."

## 8

ఈగూఢచారుల వృత్తాంతాలలో శృంగారరసము మిళి తముచేసి, అద్భుతములైన కల్పనలు చేయడానికి చాలా అవ కాశాలు ఉన్నవి. కాని మనము ప్రస్తుతము చెప్పుకొనేవి యథార్థంగా జరిగిన విషయాలు. వాటిని కులాసాగా కబుర్ల కింద చెప్పుకొంటున్నాము. వీనిలో సామాన్యంగా శృంగారానికి తావుండదు. భావనాప్రపంచంలో భాషాసౌష్ఠవము ఊతగా స్వైరవిహారము చేయడ మనేది లేనేలేదు. ఈ వాస్తవిక సంఘటనలే ఒకొక్కప్పుడు అపరూప కల్పనకు దారితీస్తూ

ఉంటవి. అటువంటి వాటిలో ఇది ఒకటి.

కాప్టెన్ పోవనస్కీ ఒక పోలీసు ఆఫీసరు. శీవితో కూడుకొన్న చక్కటి నిండైన విగ్రహముగల యువకుడు. స్వరూపముతో పాటు స్వభావములో గూడ చాలా ఔదార్యము గలవాడు. వీటికితోడు అతనిలో మంచి బుద్ధిసూక్ష్మత ఉన్నది. సైనిక శిక్షణతో పాటు రహస్య చర్యలను గురించిన శిక్షణలో గూడా అతడు వడీవంకా లేకుండా ఆరితేరాడు. ప్రధానములైన విదేశీయ భాషలన్నింటిలోను పాండిత్యము అలవరచుకొన్నాడు. తన సంభాషణా చాతుర్యమువల్ల ఎటువంటివారినైనా లోబరచుకొనేవాడు. ఇన్ని ప్రజ్ఞలు కలవాడు కాబట్టే అతనికి ప్రపంచములో సామాన్యంగా ఏ గూఢచారులకు లభ్యముకాని ప్రణయానుభవము లభ్యమై, కడకు అతణ్ణి జీవితపర్యంతమూ విషాదసాగరంలో ముంచివేసింది.

ప్రథమంలో ఒక చిన్న సంఘటన అతణ్ణి ప్రాధాన్యంలోకి తీసుకొని వచ్చింది. మొన్నటి ప్రపంచయుద్ధము పోలెండు మీాదికి జర్మనీ చేసిన దురాక్రమణతో ప్రారంభమైన సంగతి అందరికీ తెలుసు. ఈ యుద్ధానికి పూర్వము ఎన్నో ఏండ్ల నుంచి జర్మనీదృష్టి ఎప్పుడూ పోలెండుమీాదనే ఉన్నది. అనేక గూఢచారులను పోలెండులోకి పంపి, అక్కడి విషయాలన్నీ గమనిస్తూ జర్మనీ కూర్చున్నది. పోలెండుకూడా జర్మనీలోకి గూఢచారులను పంపి, వారివైఖరి పరిశీలిస్తూనే ఉన్నది. పోలీసు సరిహద్దులలో ఎప్పుడూ కాపలాదారులు, గూఢచారులు ఉండేవారు. ఒకసారి ఒక జర్మను గూఢచారి వ్యవసాయకుని వేషములో చినిగిపోయిన దుస్తులు తొడుగుకొని, గడ్డము పెంచుకొని, కుంటుకుంటూ పోలీసు సరిహద్దు ప్రాంతా

నికి వచ్చాడు. అతణ్ణి సరిహద్దు ప్రాంతపు కంచెను దాటి పోనిచ్చారు. కంచెను దాటి అవతలికి పోగానే అతడు గండం గడిచింది కదా అని కుంటుకుంటూ నడవడం మానివేసినాడు. అక్కడ డ్యూటీలో ఉన్న సోవనస్కీ వెంటనే వెళ్ళి, అతణ్ణి అరెస్టుచేసి, తనిఖీచేయగా అతడు జర్మను గూఢచారి అని తెలిసింది. దీనితో సోవనస్కీకి మంచి పేరు వచ్చింది.

ఆ జర్మను గూఢచారి అధమ శ్రేణికి చెందినవాడు. సమర్థుడైన వాడైతే కుంటుకుంటూ నడవడము మరచిపోకుండా తన బూటులో ఒక చిన్న కంకరరాయి వేసుకొని తొడుగు కొనేవాడు.

హిట్లరు విజృంభణకు పూర్వమే సోవనస్కీ ఒక గూఢచారిగా జర్మనీ చేరాడు. బాహ్యదృష్ట్యా అతడు ఒక వ్యాపార సంస్థకు ఏజంటు. ఒక చిన్న ఆఫీసు-సిబ్బంది పటాటోపము వగైరా అన్నీ ఉండేవి. ఒక రెండేండ్లపాటు అతడు చేసిన పనేమీ లేదు. ముఖ్యమైన వారందరితోను పరిచయము సంపాదించి, మిత్రబృందాన్ని వృద్ధిచేసుకొని, తనకు కావలసిన వార్తలను ఏమీ ప్రమాదము లేకుండా సేకరిస్తూ దానితో తృప్తిపడి కూర్చున్నాడు. దీర్ఘకాలవాసిగా నియమింపబడిన గూఢచారి సాధారణంగా అవలంబించే పద్ధతి యిటువంటిది.

1933 సంవత్సరములో హిట్లరు ఛాన్సెలరు అయినాడు. స్వదేశమునుంచి సోవనస్కీకి అత్యవసరములైనటువంటి విషయాలను గురించి రిపోర్టులను పంపవలసిందని తాకీదులు వచ్చినవి. పోలెండువారు చిరకాలము క్రిందటనే గ్రహించుకొన్నారు. ఏమనంటే ఒకనాడు తాము జర్మనీతో కలిసి, రష్యాపైకి దాడి వెడలడమో, లేకపోతే జర్మను శతఘ్నులనే

ఎదురోక్కనడమో-రెంటిలో ఏదో ఒకటి జరుగక తప్పదని—

జర్మనీవారు ఆయుధసామగ్రిని ఏ ప్రమాణములో తయారుచేస్తున్నదీ పరిశీలించవలసిన పనికి సోవనస్కీ నియోగింప బడినాడు. దానితో పాటు పోలెండుమీదికి జర్మనీ ఏవిధంగా దండెత్తేదీ దానికి సంబంధించిన ప్లానులుకూడా సేకరించి పంప వలెనని—

సోవనస్కీ తనక్రింది సబ్ ఏజంట్లను జర్మనీ అంతటా విరివిగా వెదజల్లాడు. మిత్రశ్రేణియొక్క పరిధిని నిరవధికంగా విశాలము చేసుకొన్నాడు. అసంఖ్యాకులైన అతని మిత్రబృంద మును క్లబ్బులలో టీపార్టీలలో, సినిమాలలో, నాటకశాలల్లో కలుసుకొని, వారిద్వారా కూడా ఎన్నో సమాచారాలు తెలుసు కొన్నాడు. అట్టి సమావేశాలలో సంభాషణ అతివేగంగా సాగి పోతూ ఉంటుంది కాబట్టి గూఢచారులకు కావలసిన వార్తాసంగ్ర హణకు అవి గొప్ప అవకాశాలు.

అట్టి అవకాశాల మూలాన సోవనస్కీకి చాలా సంతృప్తి కలిగింది. అతని సబ్ ఏజంట్లు జర్మనీవారు చేస్తూఉండిన ఆయుధ నిర్మాణ విషయములను గురించిన భోగట్టాలు ఎప్పటికప్పుడు తెలియజేసేవారు. అతడు చాలా ఉల్లాసంగా కాలక్షేపం చేస్తూండేవాడు. ప్రధానకారణ మేమిటంటే ఆసమయంలోనే అతడు ప్రణయ సామ్రాజ్యంలో ప్రవేశించాడు.

ఒకొక్కప్పుడు ఒక పురుషుడు ఒక స్త్రీని చూచి నప్పుడు ఆమె పూర్వపరిచితవలె తోస్తుంది. అంతేకాకుండా మళ్ళీ ఆమెను ఏలాగైనా కలుసుకోవాలనికోర్కె కలుగుతుంది. ఇదేవిధంగా సోవనస్కీకి బారెనెస్ వాన్ బర్గు తటస్థపడింది. ఆమె

మహోజ్వల నవయౌవనభాసురాంగి. సౌందర్య పరిపుష్టిగల ప్రౌఢ. కాని ఆమె వివాహిత. అటువంటి శిరీష కుసుమపేశల సుకుమార మోహినీమూర్తి సోవనస్కీ గంభీరవదనదీధితులకు ముగ్ధురాలైపోయింది. ఆమె స్నేహము కామముగా పరిణమించి దుర్వ్యసనముగా పరిణమించింది. ఒక శుభ ముహూర్తాన భర్తకు నిర్దాక్షిణ్యంగా విడాకులిచ్చి, సోవనస్కీ ఉన్న యింట్లోకి వచ్చి ఆతనితో కాపురము ప్రారంభించింది.

కాముకీ కాములకు ప్రథమ సమావేశములు విషాక్తములైనప్పటికీ వారి దృష్టిలో స్వర్గ తుల్యములు. వారు హాలాహాలము త్రాగుతూ అధఃపతితులై పాతాళానికి పోతూకూడా పీయూషలహరిలో స్వర్గానికి ఎగబ్రాకుతున్నామని భావిస్తూ ఉంటారు. తెలివికలిగేనాటికి సర్వశూన్యమై చేయి మిగిలి పోతుంది.

అవధిలేని నిషాలో మునిగిపోయి, కొన్ని నెలలపాటు వారిరువురూ చాలా హుషారుగా కాలక్షేపణ చేశారు. సోవనస్కీకి వ్యాపార సంబంధమైన పనులలో ఆమె చాలా సహాయము చేసింది. అతని అసలు వృత్తిని గురించి ఆమెకు ఎన్నడూ ఏవిధమైన అనుమానమూ కలుగలేదు. సోవనస్కీ ఆమెకు అసలు విషయము చెప్పడానికి కూడా పూనుకోలేదు. పైగా ఆతని ఆంతరంగికమైన ఉద్దేశ మేమిటంటే—ఆమెను తన సంకల్పసిద్ధికి వినియోగించుకొని, ఆమెద్వారా తన గూఢచారి వృత్తికి సంబంధించిన రహస్యాలను తెలుసుకోవలెనని—

వారి భవిష్యజ్జీవితనాటకానికి యాదృచ్ఛికంగా నాందీ ప్రస్తావనలు ప్రారంభమైనవి.

సోవనస్కీ గూఢచారులలో ప్రథమశ్రేణికి చెందిన

వాడే. కాని ఒక చిన్న పొరపాటు పనిచేశాడు. ప్రేయసీ బాహు పంజరములో బద్ధుడై ప్రేమ డోలికలలో ఊగు లాడుచు మత్తుడైన వాడే ఆయె. మరి పొరబాట్ల కేమి ?

ఒకనాడు అతడు టీపార్టీనుంచి తిరిగి రాగానే విడిచిన దుస్తులను ఆమె మడతలు పెట్టుతూండగా ఎక్కడో జేబులో ఉన్న కాగితము ఒకటి పెళపెళ లాడింది. ఆ కారణంగా ఆమె జేబులన్నింటిని తడివిచూసింది. ప్రతిభా శాలియైన గూఢ చారికి మంచి జ్ఞాపకశక్తి అవసరము. అతడు ఎక్కడా నోట్సు రాసుకోకూడదు కొన్ని సందర్భాలలో విధిగా రాసుకోవలసి వస్తుంది. అప్పుడు దానిని సాంకేతిక పరిభాషలో తనకు ఒక్క డికే తెలిసేటట్లు రాసుకోవాలి.

సోవనస్కీ స్నానముచేసి రాగానే ఒక కాగితము ఆమె అతని చేతికి అందించింది.

"ఇది నీ కోటుజేబులో దొరికింది" అన్నది.

అతడు ఆ కాగితము వంక చూశాడు. తరువాత ఆమె వంక చూచాడు. ఆమెకంఠస్వరము యథార్థము పలుకు తున్నట్లుగా తోచింది.

"నీకు తెలుసునన్నమాట !" అన్నాడు.

"అవును"

ఇద్దరూ నిశ్శబ్దంగా ఉండిపోయినారు. కొంతసేపటికి సోవ నస్కీ ఆమెను సమీపించి, తన రెండు చేతులలోకి ఆమెను తీసికొని, గాఢంగా కౌగలించుకున్నాడు. ఆమె మారు మాటాడ కుండా లొంగిపోయింది.

"నీవు ఏమిచేయదలచుకొన్నావు?" అని ఆమె చెక్కిలి

ముద్దాడుతూ చెవిలో ప్రశ్నించాడు.

ఒక స్త్రీ ఏమిచేయగలదు? ఒకవైపున ప్రగాఢ కామ ప్రవృత్తి. ఒకవైపున స్వదేశము. ఆమె ఆలోచించుకొన్నది. తన ప్రియుడు నాజీలకు వ్యతిరేకంగా చేస్తున్నాడు కాని, తన దేశానికి కాదు. అంగీకరించింది.

ఆమె అంగీకరించిందికాని భయవిహ్వాల యైపోయింది. ఈ భయము తననుగురించి కాదు. తన ప్రియునిగురించి. గూఢ చారివృత్తి ఎంతటి ఉపద్రవకరమైనదో ఆమెకు తెలుసు. సోవనస్కీ మేధావంతుడే కావచ్చు. కాని ప్రమాదాలకు అతీతుడు కాడుగదా! అతనిజేబులో దొరికిన కాగితము పనికత్తె చేతికే చిక్కిఉన్నట్లయితే అతడు ఈసరికి తుపాకి బారుకు గురి అయ్యేవాడు.

ఒకనాటిరాత్రి ఆమె సోవనస్కీని గాఢమైన తన కౌగిటిలో బిగించి. పీనపయోధర సంఘర్షణతో గూడిన మధురాధరచుంబనలతో అతనిని పరవశునిగా చేస్తూ అడిగింది.

'నీ ఈ వృత్తిని మానుకోరాదూ?' అని.

'ఇది నా ధర్మము.' అన్నాడు.

'అయితే – మరి ఎన్నాళ్లు'?

'నాకు నిర్దేశింపబడిన పని పూర్తిఅయ్యేవరకు. ఈ నాజీలు పోలెండుమీదికి ఏరకంగా దాడివెడలేదీ తెలిసికొనేటంతవరకూ—'

'తరువాత పోలెండుకు తిరిగి వెళ్ళుతావా?'

''వెళ్ళిపోతాను."

అది మొదలుకొని బారెనెస్ వాన్‌బర్గ తన ప్రియునికి అపాయము రాకుండా ఉండేటట్లు ప్రయత్నములు ప్రారంభించింది. సంఘంలో తనకున్న పలుకుబడిని వినియోగించి, ప్రయోజనకారులైన పలువురు పెద్దలుచేరే పార్టీలకు సోవనస్కీని తీసికొనివెళ్ళింది. అతని సంకల్పము నెరవేరే సూచనలు కనిపిస్తూనే ఉన్నవి కాని కొంచెము ఆలస్యము జరుగవచ్చు.

తనస్థితిని చూచుకొని సోవనస్కీ చాలా సంతృప్తిపడ్డాడు. అతడు కూలికి విషంతాగే మోస్తరువాడు కాడు. అటువంటివాళ్లు త్వరగాపని ముగించుకోవాలనీ, చాలా డబ్బు సంపాదించాలనీ చూస్తూ ఉంటారు. సోవనస్కీ తన దేశము కొరకే పాటుబడుతున్నాడు కాని, డబ్బుకోసము కాదు. దేశభక్తిగల గూఢచారి నిజంగా పరమపూజనీయుడు, ధీరోదాత్తుడు. యుద్ధంలో సైన్యాధిపతి వేయిమందిని వెంటబెట్టుకొని పోట్లాడుతాడు. ఇతడు ఒక్కడే వేయిమంది శతృవులతో ఎదుర్కొని పోట్లాడుతాడు. దైవానుకూల్యము లేకపోతే అజ్ఞాతంగా 'నా' అనుకొనేవారు దగ్గర లేకుండా ప్రాణాలు అర్పిస్తాడు.

1934 లో ఒక సాయంకాలము ఆమె తన బంధువులైన ఒక యువతిని యింటికి తీసికొనివచ్చి, ఫలాహారము, పానీయము ఇచ్చి సత్కరించి, కూర్చోబెట్టింది. ఆమె పేరు ఫ్రావెలిన్. ఆమెను తీసికొనివచ్చి సోవనస్కీతో పరిచయము చేస్తూ సోవనస్కీవంక ఒకచూపు చూసింది. ఆ చూపుతో ఫ్రావెలిన్ తమకు చాలా ఉపయోగపడే మనిషి అనీ ఆమెయెడల చాలా గౌరవ మర్యాదలతో మెలగవలసి ఉంటుందనీ సోవనస్కీ అర్థము చేసుకొన్నాడు. ఫ్రావెలిన్ కొంచెముసేపు

కూర్చొని వెళ్ళిపోయింది. ఆమె గడపదాటగానే సోవనస్కీ వచ్చి ప్రియురాలిని గాఢంగా కౌగలించుకొన్నాడు.

"ప్రాణప్రియా! నా సంకల్పసిద్ధికి నీవుకూడా పూనుకొన్నావా?" అన్నాడు.

"అవును ప్రియతమా? ఎటువంటి పనిఅయినా చేస్తాను. ఇది ఒప్పో తప్పో నాకు తెలియడము లేదు. నీ అపాయస్థితిని గురించి తలుచుకో లేకుండా ఉన్నాను. కాబట్టి నీపనిని త్వరగా ముగించుకొని మనము పోలెండుకు వెళ్ళిపోదాము. ఈ నాజీలంటే నాకు పరమ అసహ్యాము. వాళ్లవన్నీ రాక్షసచర్యలు. నీవు పట్టుపడ్డావంటే——" ఆమె యిక మాట్లాడలేక వణికిపోయింది.

జర్మనీవారి యుద్ధ కార్యాలయంలో ఒక సంప్రదాయము ఉన్నది. రహస్యకాండకు సంబంధించిన వ్రాతపని యావత్తూ ఒక ప్రత్యేకమైన సిబ్బందిచేత చేయిస్తారు. ఆ సిబ్బందిలోనివారు ఎవరంటే – మూడువంతులు గవర్నమెంటు సర్వీసులో నుంచి విరమించుకొని పింఛనుపుచ్చుకొనిన ఆఫీసర్ల కొమార్తెలు. ఈ పద్ధతి చాలా సంతృప్తిగా నడిచింది. ఎందుకంటే–మగవాళ్లకంటె ఆడవాళ్లు తమ వంశ మర్యాదలను, గౌరవ ప్రతిష్ఠలను కాపాడుకొనడానికి ఎక్కువగా పాటుబడతారు. ఫ్రావెలిన్ తండ్రి ఒక రిటైర్డు కర్నలు. పూర్వము భాగ్యభోగ్యాలు చవిచూసినవాడు. ప్రథమ ప్రపంచ యుద్ధము అనంతరము కలిగిన ఆర్థిక సంక్షోభములో అతని సర్వస్వమూ నాశనమైపోయింది. అందువల్ల ఆయన కూతురు తప్పని సరిగా ఉద్యోగము చేయవలసి వచ్చింది. ఉద్యోగములో ఆమె కొంత సంపాదిస్తూ ఉన్నదికాని ఆ వచ్చే జీతము వారికి చాలడము

లేదు. వెనుక అనుభవించిన భోగాలకోసము అఱ్ఱులు చాస్తూ చాలా అసంతృప్తిగా వారి జీవితములు గడుపుతున్నారు. ఆ సాయంకాలము ఫ్రెవెలిన్‌తో జరిగిన సంభాషణలో ఆమె సంసారపరిస్థితులు వీరికి బాగా తెలిసినవి.

సోవనస్కీ చాలా చాకచక్యంతో వ్యవహరించాడు. సమర్థుడైన గూఢచారి మంచి మనస్తత్వజ్ఞుడై ఉండాలి. కాల క్రమేణ ఫ్రెవెలిన్‌తో పరిచయము అధికమైన కొలదీ ఆమె తలమకాంటే ధనవంతురాలు కాగల సూచనలు చేస్తూ వచ్చాడు. ఒకనాడు మంచి సమయము కనిపెట్టి సైనిక కేంద్రాలకు పోయే సప్లయిలను గురించి సూటిగా ఆమెను ప్రశ్నించాడు. ఆ విషయము ఎందుకు కావలెనంటే తన వ్యాపార సందర్భములో చాలా ఉపయోగ పడుతుందని చెప్పాడు. ఆమె ఏమీ ఆలోచించకుండా తాను టైపు చేసిన కాగితాలలో ఉన్న సంగతులు గభాలున చెప్పివేసింది.

"నా మనస్సులో ఉన్న విషయాలను నీవు రూఢిపరచావు. కాబట్టి దిగులులేకుండా నేనీ పనికి పూనుకోవచ్చు. ఇంత ఎందుకు? నీకు నిజము చెబుతున్నాను. ఈ సప్లయిలో నాకు పదివేల మార్కుల లాభము వస్తుంది. అటువంటి లాభములో నీకు ఏదో కాస్త పెర్సంటేజి యివ్వడము న్యాయము కాదూ?"

ఈ మాటలు అంటూ సోవనస్కీ ఆమెచేతికి వేయి మార్కులు కరెన్సీ నోట్లలో అందిచ్చాడు. ఆమె ఒక్కసారిగా ఉప్పొంగి పోయింది. సోవనస్కీకి కావలసిన చేప వలలో పడ్డది. ఆమె తప్పించుకొని పోవడానికి ప్రయత్నించేటట్లయితే పట్టియియ్యవచ్చు:

ఆమె ఏమీ ప్రయత్నము చేయలేదు. పైగా అంత సుల భంగా డబ్బు సంపాదించి భోగాలలో ఊగవచ్చునని ఆమెకు అమిత సంతోషము కలిగింది. ఇది మొదలుకొని సోవనస్కీకి కావలసిన పనులు చక్కగా సాగిపోయినవి. ఇంత మాత్రము చేత ఫ్రావెలిన్ సమస్తములైన విషయాలు తెలుసుకోగలుగు ననీ, ఆమె చేతికి దండయాత్రా వివరాలు గల ప్లానులు చిక్కినవనీ భావించడానికి వీలులేదు. ఆమెకు యుద్ధ కార్యా లయంలో క్వార్టరు మాస్టరు జనరలుశాఖలో పని తరచుగా తూర్పు దిశకు-అంటే పోలెండు వైపులకు - పోయే సప్లయిలను గురించిన షెడ్యూళ్లను ఆను టైపు చేయవలసి ఉంటుంది. వాటిలో ఉన్న వివరాలనుబట్టి బుద్ధి సూక్ష్మతగలవారు ఎన్నో అమూల్యములైన విషయాలు తెలుసుకోవచ్చు.

ఈ ఘట్టంలో సోవనస్కీ యింకొక పొరబాటు చేశాడు. గూఢచార వృత్తిలో ఒక సిద్ధాంతము ఏమిటంటే-ఒకసారి బైటపడిన పద్ధతిని మళ్లీ ఉపయోగించకూడదు. కాని సోవ నస్కీ ఆ పద్ధతినే ఉపయోగించమని ఫ్రావెలిన్‌తో చెప్పాడు. ఒక టైపిస్టు సదరు షెడ్యూలు కాపీని దొంగిలించుకొని రావ డానికి వీలులేదు. అవి ఫైల్సులో జాగ్రత్తగా నెంబర్లు వేయ బడి ఉంటవి. కాని వాటిని టైపుచేసేటప్పుడు సరికొత్త కార్బను పేపర్లు ఉపయోగించితే వాటిమీద అక్షరాలు, అంకెలు చక్కగా కనబడతవి. షెడ్యూలు టైపుచేయిడానికి ఉపయో గించిన కార్బను పేపర్లన్నీ పట్టుకొనివస్తే దాని కాపీని తీసికొని వచ్చినట్లే.

ఈ పద్ధతినే ఫ్రావెలిన్ అవలంబించింది. సుమారు పది పన్నెండు పర్యాయములు ఎవరికి ఏవిధమైన అనుమానమూ

లేకుండా సోవనస్కీకి కార్నను పేపర్లు తెచ్చి యిచ్చింది. అతడు ఆమెకు ప్రతిఫలముక్రింద పుష్కలంగా డబ్బు యిచ్చాడు. ఆమె ఇదివరకు తాను ఉన్న బీదకొంప వదలిపెట్టి ఒక చిన్న మేడలో కాపురము పెట్టింది. డబ్బు బాగా విరివిగా వాడడము సాగించింది.

కాలము గప్‌చిప్‌గా గడిచిపోసాగింది. ఫ్రావెలిన్ తల్లి బవేరియాలో ఉన్నది. ఆమె కూతురును చూడడానికి అకస్మాత్తుగా బెర్లినుకు వచ్చింది. తన కూతురు ఉన్న ఐశ్వర్యదశ చూసి ఆశ్చర్యపోయింది. ఫ్రావెలీన్ తగిన సమాధానము చెప్పింది. తన తండ్రికి పూర్వ స్నేహితుడైన జనరల్ ఒకడు తనకు బాగా డబ్బు గడించే స్థానము ఇచ్చాడని.

చాలా నెలలు గడచిపోయినవి. సోవనస్కీ తలపెట్టిన కార్యక్రమమంతా పూర్తి కావచ్చింది. సప్లయి ఆగ్నై జేషనుకు సంబంధించిన వివరాలను ఆధారంగా పెట్టుకొని యుద్ధ సన్నాహాలను, వ్యూహాలను అవగాహన చేసుకొన్నాడు. త్వరలోనే బెర్లిను నగరాన్ని వదలిపెట్టి సురక్షిత స్థానమైన పోలెండుకు వెళ్ళిపోదామని ప్రియురాలితో చెప్పాడు. కాని పనితనము గల వాడివలె సర్వమూ అమూలాగ్రముగా పూర్తిచేసుకొని వెళ్ళు దామని అనుకొన్నాడు.

గూఢచారి జీవిత మరణములు స్వల్పవిషయాలమీద ఒకొకప్పుడు ఆధారపడి ఉంటవి. ఒకసారి జర్మను గూఢచారి ఒకడు ఇంగ్లాండుకు సురక్షితంగా చేరుకొన్నాడు. అతని ఆదుర్దా ఏమిటంటే తాను దిగినతావునుండి దూరానికి అతి శీఘ్రంగా వెళ్ళిపోదామని-ఒక గ్రామానికి వెలుపలగా రోడ్డు మీద ఉన్న కాఫీ హోటలు ముందర కొన్ని సైకిళ్లు కనబడి

నవి. అందులో ఒకదానిని దొంగిలించుకొని రోడ్డుకు కుడి వైపుగా పోనిచ్చుకుంటూ ఊళ్ళోకిగుండా పోయినాడు. కొంత దూరము పోగానే ఒక పోలీసువాడు ట్రాఫికు రూల్సుకు విరుద్ధంగా పోతూ ఉన్నందువల్ల వెంటనే పట్టుకొన్నాడు.

ఆ గూఢచారి ఒక చిన్న విషయాన్ని మరిచిపోయినాడు. జర్మనీ ట్రాఫికు రూల్సు బ్రిటిషు ట్రాఫికు రూల్సుకు కేవలము విరుద్ధము. జర్మనీలో రోడ్డుకు కుడివైపున పోవాలి. ఇంగ్లాండులో ఎడమవైపున పోవాలన్న సంగతి మరచిపోయినాడు. పర్యవసానము పట్టుబడడము. విచారణ, మరణదండన.

గూఢచారికి వచ్చే వార్తలన్నీ ముక్కలు ముక్కలుగా అనేక తావులనుండి వస్తూ ఉంటవి. కాబట్టి ఏమూల ఏ చిన్న పొరబాటు జరిగినా ఆతని ప్రాణాలు పోతవి. అతడు చాలా జాగ్రత్తగానే మెలగుతూ ఉండవచ్చును కాని దాని వాలు తప్పిందంటే అది ఎందుకూ అక్కరకురాదు.

రాబర్టు అనే జర్మను గూఢచారి డెన్మార్కులో ఉండగా తాను ఇంగ్లాండు వెళ్ళి చేయబోయే పనిని గురించి వివరాలతో సహా జర్మనీలో ఉన్న తన స్నేహితుడొకడికి ఉత్తరము రాశాడు. ఆ ఉత్తరాన్ని డెన్మార్కులోని పోస్టలు సార్టరు పొరబాటున జర్మనీ సంచిలో బదులు ఇంగ్లాండు సంచిలో వేశాడు. ఆ ఉత్తరము ఇంగ్లాండుకు చేరుకొన్నది. రాబర్టు కథ అంతటితో గడ్డ కట్టి పోయింది. ఇంగ్లాండులో అడుగు పెట్టగానే అతన్ని అరెస్టు చేశారు.

అసలు కథకు వద్దాము.

సోవనస్కీ సుఖంగానే కాలక్షేపణ చేస్తున్నాడు. అమిత ఆశ్చర్యకరంగా పిడుగుపాటున ఒక సంఘటన జరిగింది. ఒక

నాడు ప్రియురాలితో కలసి డిన్నరు పార్టీనుంచియింటికి తిరిగివచ్చే టప్పటికి "గెస్టపో" సిబ్బంది అతని యింటి చుట్టూ ముట్టడించి ఉన్నది. అతడు చాలా ధైర్యంగా ఉన్నాడు. అతని యింట్లో ఆచూకి ఏమీ దొరకదు. అతడు వారిమీద అరిచాడు. వారిని బెదరించాడు. మాన నష్టపు దావా తెస్తా నన్నాడు. కాని ఆ "గెస్టపో" అధికారి అతి నిబ్బరంగా ఉన్నాడు. ఇతడు ఎన్ని మాటలన్నా మాట లాడలేదు. చివరకు ఇట్లా అన్నాడు.

"కాప్టెన్ సోవనస్కీ! నీవు వృథాగా నోరు పారవేసుకో బోకు. ఫ్రావెలిన్‌ను అరెస్టుచేసి ఉంచాము. బహుశః ఇవి నీకు తెలిసే ఉంటవేమో!" అంటూ అతడు కొన్ని కార్బన్ కాగి తాలను తన సంచిలో నుంచి బైటికి తీసి యిచ్చాడు. వాటిని చూడటముతోటే సోవనస్కీ నిశ్చేష్టుడై ప్రాణాలమీద ఆశ వదులుకొన్నాడు.

ఇంతలోనే యింతమార్పు –

సుధామయూఖుడు జ్యోత్స్నా పయస్సులతో ప్రియు లకు అభిషేచనము చేస్తూ ఉన్న ఆ సుమనోహర శరత్కాల పూర్ణిమ చూస్తుండగానే నీలమేఘా వృతమై ఝుంఝూనిలో ద్ధతితో కజ్జల సదృశ గాఢ తమస్వినీకలితమైన కాళరాత్రిగా మారిపోయిన దేమి? మంద పవనములకు లయ నెరపుతూన్న చిట్టి తరగల పుష్కరిణిపై విలాసముగా తేలిపోవుచున్న వారి జీవిత విహార నౌక ప్రచండ ప్రభంజ నోత్తుంగ తరంగమాలా సంకులంబైన భయంకర సాగర మధ్యములో చిక్కినదేమి?

దీనికి కారణము ద్రోహము కాదు. ఒక చిన్న పొర బాటు.

మూనిచ్ లో ఒక టీపార్టీ సందర్భములో ఫ్రావెలిన్ తల్లి-వెనుక తన కూతురు ఏ జనరలు సహాయమువల్ల తనకు బాగా డబ్బు దొరికే స్థానము లభించిందని చెప్పిందో - ఆ జనరలును కలుసుకోవడము సంభవించింది. తన కూతురుకు చేసిన సహాయానికి బదులుగా ఆయనకు తన ధన్యవాదాలు సమర్పించింది. ఇది స్వభావ విరుద్ధము కాదుగదా!

ఆ జనరలు కాలాంతకుడు. ఆవులించితే పేగులు లెక్కబెట్టే తత్వములో వాడు. అటువంటి పని ఏమీ చేసినట్టు అతనికి ఎక్కడా దృష్టికి తగలలేదు. అప్పటికి ఏమీ మాట్లాడకుండా ఊరుకొన్నాడు. కాని అతని అనుమానము యదార్థ విషయాలదాకా పోలేదు. ఆ యువతి ఎవడినో ఒక భాగ్యవంతుడిని లోబరచికొని యీ సాకు చెప్పిందనుకొన్నాడు.

ఆ జనరలు బెర్లినుకు తిరిగి రాగానే ఫ్రావెలిన్ విషయమై రహస్యంగా భోగట్టాలు చేయడానికి తన అంతరంగికుణ్ణి ఒకణ్ణి నియోగించాడు. వాడు విచారణచేసి ఫ్రావెలిన్ నైతిక ప్రవర్తనలో ఏమీ దోషము లేదన్నాడు. ఆమె దగ్గర దుర్నీతి లక్షణాలు ఏవీ లేవు. యుద్ధ కార్యాలయంలో ఆమె ఉద్యోగము, స్థితి ఆమెకు వచ్చే కొద్ది జీతము వగైరా వివరాలన్నీ కూడా చెప్పాడు.

"ఓహో! నేను అనుకొన్న దానికంటె తీవ్రమైన విషయమే యిది. అతిరహస్యంగా ఉంచదగిన పనిని చేస్తూ ఉన్న ఒక చిన్న ఉద్యోగి తన ఆదాయానికి మించిన విధంగా జీవితము గడుపుతూన్నపుడు ఇంక దాని విషయము అడగడమెందుకు? పోలీసువారి గూఢచారుల శాఖకు దర్యాప్తు నిమిత్తము పంపండి." అన్నాడు.

తరువాత వారాల తరబడి ఓపికతో రహస్యంగా విచారణలు సాగినవి. కార్బను కాగితాలతో ఫ్రావెలిన్ పట్టుబడింది. ప్రాణాలను రక్షించుకొనే ఆశతో ఆమె అంతా నిజము చెప్పింది.

ఈవిధంగా వారికి సర్వనాశము సంభవించింది. ఆ స్త్రీలిద్దరికి మరణ దండన విధించారు. ఫ్రెంచి రెవల్యూషనునాటి గిల్లోటైనును పోలిన భయంకర మారణ దృశ్యము బెర్లిను జెయిలులో మళ్ళీ గోచరించింది. ప్రత్యక్షంగా చూసినవారు ఒకరు ఇట్లా చెప్పారు :

తలారి నల్లటి దుస్తులు వేసుకొని వచ్చాడు. అతని ముఖము కనబడకుండా నల్లటి ముసుగుగూడా కప్పుకొన్నాడు.

ఆఖరు క్షణంలో ఫ్రావెలిన్ భయాన్ని భరింపలేక పోయింది. ముగ్గురు మనుష్యులు ఆమెను మోసుకొని వధ్యస్థానానికి తీసుకొని వచ్చారు. ఆమెను ఎత్తుకొని వచ్చేటప్పుడు కాళ్ళా చేతులా తన్నుకొంటూ బొబ్బలు పెడుతూ ఏడుస్తూ నానాహంగామా చేసింది. ఆమె మెడను దిమ్మెమీద సరిగా ఉంచి గట్టిగా పట్టుకొని ఉండగా తలారి గండ్రగొడ్డలిని తీసుకొని ఆమె తల నరికివేశాడు. మొదటి దెబ్బ సరిగా తగలలేదు. దానితో తలారికి కూడా చేతులు వణకినవి. పోయీ పోవని ప్రాణంతో ఆ దేహము రక్తప్రవాహంతో ఒక అయిదు నిమిషాలు గిజగిజ కొట్టుకొన్నది. ఆ భీభత్సం చూడలేక అందరు కళ్లుమూసికొని వెనక్కుతిరిగి నిలువబడ్డారు. ఎట్లాగో తలారి తనపని పూర్తిచేసి మూర్ఛపోయినాడు.

బారెనెస్ వాన్ బర్గు చాలా ధైర్యంతో మృత్యువును ఎదుర్కొన్నది. తనతోబాటు తనప్రియుడు కూడా మృత్యు

గ్రిస్తుడే కాబట్టి మరణానంతరము పునస్సమాగమముకొరకు నిరీక్షిస్తూ కాలము గడిపింది.

ఆమె కడసారి గడియలు కఠినములైన రాతిగుండెలను కూడా కరగించివేసినవి. ఆమె వధ్యశిలకు ఎదురుగా సోవనస్కీ ఫోటోను పెట్టుకొని, దానిముందర మోకరిల్లి ఆతనినే ధ్యానిస్తూ అతని విగ్రహాన్నే ప్రాణాలు పోయేవరకు తన మనసులో నిలుపుకొన్నది. తరువాత తన దృష్టిని చెదరనీయకుండా జుట్టు గట్టిగాముడివేసుకొని, తనమెడను నిమ్మళంగా దిమ్మమీదికి చేర్చింది.

తలారికి చేతులాడలేదు. అతనికి ముచ్చెమటలు పోసినవి. అప్పుడే తెల్లవారింది. ఇంకా సూర్యోదయము కాలేదు. ఫిబ్రవరినెల చలిగాలి వీస్తూఉన్నది. అటువంటిసమయంలో ముచ్చెమటలు దిగకారినవంటే ఎంత సంచలనము కలిగిందో! అతనికి తల నఱకమని ఆఫీసరు ఆజ్ఞాపించాడు. అతను ధైర్యము తెచ్చుకొని పట్టుసడలకుండా చూచుకొని గండ్రగొడ్డలిని ఎత్తి దెబ్బవేశాడు. ఒక దెబ్బతో సౌందర్యనిధియైన ఆమెతల నేలమీద దొర్లుకుంటూ పోయి తన ప్రియుని చిత్రందగ్గర ఆగింది. ఆ తలారికి కాళ్లు గజగజలాడి కళ్లు గిరగిర తిరిగి తడబడి కింద పడిపోయినాడు. ఇద్దరు మనుష్యులు పట్టుకొని అతనిని అక్కడ నుంచి తీసుకొని వెళ్లారు. కొంచెము స్వస్థపడిన పిమ్మట తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు.

బెర్లినునగరంలో అంతటా పోస్టర్లు అంటించారు. ప్రభుత్వ ద్రోహులను ఇద్దరిని తల నరకించినారని. మరి సోవనస్కీ ఏమైనాడు? అతనిగతి ఏమైనది? అతనికికూడా మరణదండనవిధించారు. అంత్యదినము కొసము అతడూ ఎదురు చూస్తూనే ఉన్నాడు.

ఇంతలో ఏమిజరిగిందంటే జర్మను ప్రముఖ గూఢచారిణి ఒకతె పోలెండులో పట్టుబడింది. మామూలు రాజకీయపద్ధతిలో పోలీసువారు సోవనస్కీ తమకు గూఢచారి కాడని వాదించారు. ఆగూఢచారిణి విషయంలోకూడా జర్మనీవారు అట్లాగే వాదించారు. అటుమీదట తమ ఖైదీలను మార్పు చేసుకోవడానికి రాజీ పడ్డారు. ఆ గూఢచారిణి జర్మనీవారివశము చేయబడింది. సోవనస్కీ పోలెండు వెళ్ళిపోయినాడు.

ఈవిధంగా సోవనస్కీ మరణదండన తప్పింది. అతడు ఏమి పుణ్యము చేసుకొన్నాడో జగన్మోహన సౌందర్యరాశియైన ఒక స్త్రీహృదయపీఠాన్ని సుస్థిరంగా స్వార్థరహితమైన ప్రేమరాజ్యాభిషిక్తుడుగా ఆక్రమించుకో గలిగాడు. కాని ఇప్పుడాతని స్థితి.

సతి ప్రదీపే సత్యగ్నౌ
సత్సు తారారవీందుషు,
వినా మే మృగశాబాక్ష్యా
తమోభూత మిదం జగత్.

అని భర్తృహరి వర్ణించినట్లుగా అతని జీవితము అంధకార బంధురమై పోయింది. తనకై ప్రాణాలర్పించిన ప్రియురాలిని తలచుకొంటూ అతడు కుమిలి కుమిలి కుప్పగూలి పోయినాడు. ఏడాక్టరూ అతణ్ణి బాగుచేయలేకపోయినాడు. అతడు పిచ్చివాడై యీనాటికికూడా పోలెండు ముఖ్యపట్టణమైన వార్సానగర వీధులవెంబడి శోకమూర్తిగా తిరుగుతూ ఉండవచ్చు.

# 9

కథలలోనూ సినిమా ఫిల్ములలోనూ గూఢచారిణులను సౌందర్యవతులుగా నిరూపిస్తారు. గూఢచారిణులు సౌందర్యవతులుగా ఉండ నక్కరలేదు. సాధారణ సాంసారిక స్త్రీలు కూడా అనేక కార్యాలు నిర్వహించారు. కాని వారిలో నేర్పు గలిగిన వారు బహు అరుదు. కారణము వారికి ధైర్యములేకా తెలివి తేటలు లేకా కాదు. వారికి లభ్యమయ్యే తరిబీతు సమగ్రమైనదిగా ఉండదు.

ఈ ద్వితీయ ప్రపంచమహాసంగ్రామ రంగంలో మగవారికంటె స్త్రీలే చాలా భాగం నేర్పుగలిగినవా రున్నారు. అనేక చిన్న విషయాలను సేకరించి వాటన్నిటిని క్రోడీకరించి ఒక నిర్ణయానికి వచ్చి శత్రువుల పన్నాగములను తెలుసుకోవడము సామాన్యమైన కృషిగాదు. ఆ పైమెట్టు పనులన్నింటికీ పేరుపొందిన ప్రతిభాసంపన్ను లుంటారు. కాని చిన్న చిన్న విషయాలు పోగుచేసి వాటిని రవాణా చేయడానికి మాత్రము స్త్రీలు చాలా బాగా ఉపయోగపడతారు.

ఇది మదలీనా అనే పేరుగల ఫ్రెంచి యువతి కథ. ఆమె చాలా ధైర్యము గలది. ఆమె అన్న యుద్ధఖైదీగా జర్మనీలో ఉన్నాడు. తల్లి ఆమె మీాదనే ఆధారపడి ఉన్నది. జర్మనీలో పని చేయడానికి ఐచ్ఛికదళాలు కావలసి వచ్చినపుడు మొదటి జట్టులోనే యీామె వెళ్లింది. ఆహారసామగ్రి కొంత సులువుగా దొరుకుతుంది. తల్లి కొంతకాలం సుఖంగా బ్రతుకుతుంది అని ఆమె యోచన.

మదలీనా ఒక ఫ్రెంచి ఉపాధ్యాయుని క్రింద తరిబీతు

పొందింది. ఆమె పేరు లూయియా. ఆమె గతయుద్ధంలో (1914-18) జర్మనీ సైన్యాల వెన్నెముకలన కాచుకొని ఒక గూఢచార వర్గాన్ని బహు నిపుణతతో నిర్వహించింది. బ్రిహ్మాండంగా ప్రచారంలోకి వచ్చిన మాతాహారీల కంటె నిజానికి యీ లూయియా పెక్కురెట్లు గూఢకార్య కలాపాన్ని నడిపింది.

మదలీనా కూడా ఒక ఉపాధ్యాయిని. జర్మనీవారు ఆమెను తమ దేశంలోకి పిలిచి జీతమిస్తున్నారంటే తమమీద గూఢచర్యనడిపి తమ రహస్యాలను శత్రువులకు తెలియజేయుడా. కి ఆమెను నియోగించుకొన్నారన్నమాట. మొట్టమొదట ఆమెను కొలోను దగ్గర ఉన్న ఒక విమాన నిర్మాణశాలకు పంపించారు. ఆమె సూక్ష్మ బుద్ధి - ఆమె పనిచేసే తరహా - అందరిని ఆకర్షించింది. ఆరు నెలలపాటు గెస్టపో అధికారులు ఆమెను బహు జాగ్రత్తగా పరిశీలించారు. ఆమెలో వ్యతిరేక రాజకీయ అభిప్రాయాలు అనుమానగ్రస్త విషయాలు ఏవీ కనబడ లేదు. అటుతరువాత ఆమె జర్మనీ పరిశ్రమలలో నిలిచి పోయిన ఫ్రెంచిస్త్రీలకు సంబంధించిన Welfare Worker స్థానంలో నియమింపబడింది.

ఈ ఉద్యోగస్థానము మదలీనా వాంఛించిందే అనే రహస్యాన్ని జర్మనులు తెలుసుకోలేక పోయినారు. మొదట్లో విమాన నిర్మాణశాలలో మదలీనా పని బహుకొద్ది. యంత్రనిర్మాణంలో ఒక చిన్న భాగము కొలతలు సరిచూడడము ఆమెకు నిర్దేశింపబడిన ప్రతిదిన కార్యక్రమం. గూఢచర్యకు ఆమెకు అప్పుడు అవకాశాలు దొరకలేదు. Welfare Worker స్థానంలో ఆమెకు ఇప్పుడు ప్రయాణాలు చేయడానికీ నలుగురినీ కలుసుకొని మాటలాడటానికీ అవకాశం దొరికింది. ప్రభుత్వము

వారి ఖర్చులతో ప్రభుత్వమువారి పర్మిటుతో ఆమె అన్ని చోట్ల తిరిగి రావచ్చును. జర్మనీవారి పోషణ క్రిందనే జర్మనీ వారిని ఓడించవలెనని ఆమె నిశ్చయించుకొన్నది.

కొలోనులో విదేశాలనుండి వచ్చిన కార్మికులకు వేతనాధికారిగా నియమింపబడినవాడు ఒకప్పుడు బ్యాంకు మేనేజరుగా పనిచేసిన వాడని మాత్రమే జర్మనులకు తెలుసు. అతడు జర్మనీలో మిత్రమండలివారిచే ఏర్పాటు చేయబడిన Allied Secret Service అనే సంస్థలో ఒక ముఖ్యాధికారి అని వాళ్లకు అసలు తెలియనే తెలియదు.

ఒకనాడు అతడు మదలీనాను పిలిచి "అమ్మాయీ! ఎడతెగకుండా చేయవలసినపనులుంటవి. అపాయాలను గురించి నేను చెప్పవలసిన పని లేదనుకొంటాను" అన్నాడు.

"చెప్పక్కర లేదు"

"మంచిది. ప్రస్తుతము నీపని వార్తలు రవాణా చేయడము. నీవు పోయే ఫ్యాక్టరీలలో ఉన్న మన ఏజంట్లకు ఉత్తరువు లందించి వాళ్ల జవాబు తీసికొని రావాలి"

మదలీనాకు ఉత్సాహము అతిశయించింది. ఆమె భావనలో గూఢచర్య నెరపడమంటే ముసలి కర్నలును మోసపుచ్చి ఆయన నిద్రపోయిన తరువాత ప్లానులు దొంగిలించుకొని రావడము కాదు. ఆమె చేయవలసిన పని చాలా ముఖ్యమైనది. బాధ్యత కలిగినది. సామాన్యులు చేయగలిగే పనికాదు. యుద్ధకాలంలో వార్తలు సులువుగానే సేకరించవచ్చు కాని వాటిని గమ్యస్థానాలకు చేరవేయడమే చాలా కష్టసాధ్యమైన పని.

"నీవు కొన్ని పద్ధతులను ఆలోచించి అట్టిపెట్టుకొన్నావా?" అని వేతనాధికారి ఆమెను అడిగాడు.

"ఆ. నేను జర్మను పద్ధతులనే అవలంబించ దలచు కొన్నాను."

"ఏమిటి?"

"అవును. ఇక్కడ తమ పద్ధతులను గురించి అసలు చూడనే చూడరు."

"మరి-వాళ్ల ప్రత్యేకతలు-నీకు తెలుసా?"

"తెలుసు."

అప్పటి పరిస్థితులు ఎట్లా ఉన్నవంటే – పశ్చిమ జర్మనీ ప్రాంతమంతటా ఫ్రెంచి కార్మికులు చెల్లా చెదరుగా ఉన్నారు. ప్రతి ఫ్యాక్టరీలోను ఒక ఏజంటు ఉన్నాడు. వారు ప్రతిదినము సమాచారాలను సేకరించి జాగ్రత చేసి ఉంచేవారు. వాటినన్నిం టిని పోగుచేసి ప్రధానాధికారికి చేరవేయడము దుస్సాధ్యంగా ఉండేది. ఆపని యిప్పుడు మడలీనా పాల బడింది.

ఆమె ప్రథమ ప్రియత్నము సులభంగానే నెరవేరింది.

హానోవరు దగ్గర ఉన్న ఒక ఫ్యాక్టరీలో కొన్ని ట్యాం కులు నిర్మిస్తున్నారు. వారానికి ఎన్ని ట్యాంకులు చొప్పున నిర్మాణము సాగుతున్నదో లండనుకు అర్జంటుగా కావలసి వచ్చింది, ఆ పనికి మదలీనా పూనుకొన్నది. కార్మికులకు ఈ విషయాలన్నీ తెలిసేఉంటవి. కాని వారా విషయాలు వేత నాధికారికి కూడా తెలియనీయ గూడదు.

మదలీనా ఆ సమాచారాన్ని పోస్టుద్వారా తెలియ జేసింది. వానిలో అనేక పద్ధతులున్నవి. కాని స్వల్పములైన వాటినే ముందుగా ప్రయోగించి చూద్దామనుకొన్నది.

కొలోనులో ఉన్న ఆమె స్నేహితురాలికి ఒక చిన్న

ఉత్తరము వచ్చింది. ఆ ఉత్తరంలో ఉన్న సంగతు లివి.

"నేను అనుకోకుండా కొన్నిరోజులు ఇక్కడ ఉండ వలసి వచ్చింది. వెంట తెచ్చుకొన్న గుడ్డలు చాలవు. నాకు మరికొన్ని గుడ్డలు కావాలి. దయచేసి యీ క్రింది పేర్కొన్నవి పంపించు.

"1. Frock. 2. Overall 3. Rosette 4. Tunic. . Yoke."

వీటి మొదటి అక్షరాలన్నీ కలిపి చదివితే Forty అనే మాట ఏర్పడుతుంది. కావలసిన సమాచారము తెలిసింది. ఆ ఫ్యాక్టరిలో వారానికి నలభై ట్యాంకుల చొప్పున తయారవుతూన్నవి. కొన్ని నిముషాల్లో ఆ వార్త లండన్ చేరుకొన్నది. ఈ పద్ధతిలో ఈపని సులువైనదేకాని ఆమె చేయడానికి పూనుకొన్న పనులముందర చాలా స్వల్పమైనది. అర్జంటు కాని వార్తలు కంఠపాఠము చేయవచ్చును. ప్లానులు కాగితము మీదనే తప్ప యింకోరకంగా అందివ్వడానికి వీలుపడవు. కొత్త రకాల ఉపాయాలు కనిపెట్టడానికి హేమాహేమీలు ఏజంట్లలో ఉన్నారు.

ఆమె దవడ పండ్లలో ఒకటి బోలుది. దానికి సెల్యులాయిడ్‌తో ఒక మూతిచేయించు కొన్నది. ఆమూత తీసి ఆ బోలు పంటిలో కాగితముమీద పంపవలసిన సమాచారాన్ని యిముడ్చుకొని మొదటిదఫా తీసికొని వెళ్ళింది. ఆ పాదమస్తకము పరిశీలించారంటే ఆ బోలుపంటి రహస్యము తప్పకుండా బయట పడుతుంది. అది ఆమెకు తెలుసు కూడాను. కాని ఆమె తన ఉద్యోగ స్థానముమీద భరోసా ఉంచి అటువంటి ధైర్యము చేసింది.

మిగతా అన్ని స్వల్ప విషయాల్లోను ఆమె చాలా

జాగ్రత పడ్డది. గూఢచార వృత్తిలో ఒక చిన్న పొరబాటు జరిగిందంటే మరణమే గతి. ఒక జర్మను గూఢచారి ఇంగ్లాం డులోదిగి రైల్వే బుకింగు ఆఫీసుకుపోయి టిక్కట్లు అడిగాడు. "రెండూ పది" అన్నాడు ఆ గుమాస్తా. తత్క్షణమే జర్మను వాడు రెండు పౌనుల పది షిల్లింగులు తీసి యిచ్చాడు. ఆ గుమాస్తాకు అనుమానము తోచింది. గూఢచారి కాకపోతే నేమి? యిక్కడ కరెన్సీవాడుక తెలియని విదేశీయు డెవ్వడో కావచ్చు ననుకొన్నాడు. అయినా జాగ్రత తీసికొనడము మంచిది అని వెంటనే అప్పుడే ఇంటలిజన్సు ఉద్యోగులకు తెలియజేశాడు. వారిశ్రమ వృధా కాలేదు. సంఘంలో ఆచా రాలు మాటలాడే వైఖరి ప్రవర్తనలో భేదములు క్షణాలలో మనిషినిపట్టి యీయగలవు. ఇటువంటి స్వల్ప విషయాలలో గూఢచారి జాగ్రత్తగా ఉండకపోతే తొలిదెబ్బకే టుప్పున ఎగిరి పోతాడు.

ఆఫ్రికాలో జర్మను ట్యాంకుల ఉపయోగము నిమి త్తము వారు ఒక జల్లెడను కనిపెట్టారు. అక్కడ ఎడార్లలో యిసుక మోటార్లను ఒక గంటలో పాడుచేస్తూండేది. ఆ యిసుక బాధ లేకుండా ట్యాంకులు నిర్నిరోధంగా నడవడానికి ఆ జల్లెడ మిక్కిలిగా ఉపయోగపడుతుంది. బ్రిటిషు వారి ఏజంట్లు ఆ జల్లెడకు సంబంధించిన వివరాలు పూర్తిగా సంగ్ర హించారు. కాని మదలీనా ఆ వివరాలను తన ముఖ్యాధికారికి చేరవేసే దెలాగున ?

మొదటి యుద్ధంలో బ్రిటిషు వారి పక్షాన ఒక బెల్జి యను యువతి గూఢచర్య నడిపింది. ఆమె చాలా చక్కనిదే కాకుండా అమిత చాక చక్యము గలది. అప్పుడు ఆమెకు విద్దే

శింపబడిన పని ఏమిటంటే ఆక్రమించుకొన్న బెల్జియము నుండి ఆక్రమణముకాని హాలెండులోకి వార్తలు అందివ్వడము. హాలెం డులో ఇంటెలిజన్సు ఉద్యోగులు ఆమె కొరకు ఎదురు చూస్తూండేవారు. ఇదివరకు అమలులో ఉన్న పద్ధతులన్నీ వెల్లడి అయినందువల్ల ఆమె ఒక క్రొత్తపద్ధతి కనిపెట్టింది. ఆమె తొడుక్కొన్న బ్లౌజు విప్పి తన వీపుమీద కనబడని సిరాతో ఒక స్నేహితురాలిచేత సమాచారాలన్నీ వ్రాయించుకొనేది. హాలెండుకు చేరుకోగానే ఆమె బ్లౌజు విప్పి నిప్పుసెగవైపు వీపు పెట్టి కూర్చునేది. ఆ సెగకు అక్షరాలు స్ఫుటంగా కనబడ గానే ఆఫీసర్లు ఆ సమాచారాలను వెంటనే వ్రాసుకొనేవారు. ఆమె రూపవతి కావడమువల్ల యీపనికి ఆఫీసర్లలో ప్రతి వాడూ తహతహ లాడుతుండేవాడు.

తరువాత జర్మనులు కూడా యీపద్ధతి అవలంబించారు. మదలీనా కూడా యీ పద్ధతినే అనుసరింప దలచుకొన్నది. ఆ జర్మెడ ప్లాను తన వీపుమీద అన్ని వివరాలతో సహా వ్రాయించుకొని వెళ్లింది.

ఆమె కొలోను చేరుకొన్నది. ఆ వేతనాధికారి ఒక యింట్లో అద్దెకు ఉన్నాడు. ఇంటివారందరు సినిమాకు వెళ్లిన రాత్రి మదలీనా ఒంటరిగా ఆ వేతనాధికారి దగ్గరకు వెళ్ళింది. చూచేవాళ్లకు అది ఒక కాముక వ్యాపారము వలెనే కనబడు తుంది. అర్ధరాత్రివేళ ఆ వృద్ధ వేతనాధికారి ఒక యువతితో సమావేశము ఏర్పరచుకోవడమూ, ఆమె వచ్చి చొక్కా విపి కూర్చోవడము ఆ యింటివారెవరైనా చూస్తే ఏమనుకొం టారు? మదలీనా తలపెట్టిన పని నెరవేరింది. ఆ అధికారి ఆ రహస్యాన్ని తన ఉపజ్ఞతో ఇంగ్లాండుకు చేర్చి తన ధర్మాన్ని

నిర్వహించాడు.

విచిత్ర సన్నివేశాలకు తావు లేకుండగానే మదలీనా పని యథావత్తూ జరిగిపోయింది. కొంత కాలానికి ఏమి జరిగిందంటే- బ్రిటిషువారి R. A. F. వారికి ఆయా ఫ్యాక్టరీలలో ఏమేమి తయారవుతున్నవో వివరాలు కావలసి వచ్చినవి. ఎందుకంటే-ఫ్యాక్టరీలను బాంబు చేసేటప్పుడు ఏది ముందు ఏది తరువాత అని ఆలోచించి కార్యక్రమం నిర్ణయం చేయడానికి. ఈ సమాచారాలు చాలా ప్రమాదకరమైనవి.

విమాన దాడుల మూలకంగా విధ్వంసక చర్యలు ప్రారంభమైనవి. విదేశీయ కూలీశాఖలో పనిచేస్తూ ఉన్న యిద్దరు జర్మనులు ఇటీవల జరుగుతున్న విమాన దాడుల విషయమై ఒక రోజున మాటలాడుకొన్నారు.

"ఈ దాడులు మహాదారుణంగా ఉన్నవి. కట్టడాలూ, యంత్రాలూ పాడుకావడమే కాదు. నిపుణులైన పనివాళ్ళు చాలామంది హతమౌతున్నారు."

"నిజమే-వెల్‌ఫేర్ వర్కర్‌గా పని చేస్తూన్నదే ఆ ఫ్రెంచిపిల్ల - ఆమె ఉన్నచోట ఎక్కడా బాంబులు పడడము లేదు. ఈ దాడులను తప్పించుకొంటూ ఆమె తిరుగుతున్నది. బ్రిటిషువారు బాంబులు వేయడానికి ఒక వారము పదిరోజులు ముందుగానే ఆమె ఆ కోస్తా వదలిపెట్టి వెళ్ళిపోతుంది. చూశావా! రాత్రి బెర్లినుమీద మళ్ళీ బాంబులు పడవేశారు!"

మామూలు ధోరణిలో అన్న యీమాటలు మొదటివాడి మనస్సులో బాగా హత్తుకు పోయినవి. అతడు వెంటనే గెస్టపోలో ఉన్న ఒక ప్రధానాధికారికి యీ విషయమంతా

తెలియజేశాడు. ఆ అధికారి వెంటనే దీన్ని గురించి అట్టే పట్టించుకోలేదు. తాను సుమారు పది పన్నెండు విమాన దాడులను దైవయోగంవల్ల తప్పించుకొన్నాడు. అదే మోస్తరు ఈ ఫ్రెంచి పిల్లకూడా కావచ్చును.

"ఏమైనప్పటికీ – ఈపిల్లను కొంచెము పట్టి చూడవలసిందే – హోవెన్‌స్ట్రీట్‌లో ఉన్న కొత్త ఫ్యాక్టరీకి ఆమెను పంపండి. అక్కడ కొంతమంది ఫ్రెంచి దేశస్థులు కూడా ఉన్నారు. తరువాత ఏమి జరుగుతుందో చూద్దాము" అన్నాడు.

మదలీనా వెళ్లిన తరువాత పది రోజులకు R. A. F. వారు హోవెన్‌స్ట్రీట్‌పై విమాన దాడి జరిపారు. గెస్టపో అధికారికి చాలా సంతాపము కలిగింది. ఒక చిన్న ఆలోచన మూలకంగా ముఖ్యమైన ఫ్యాక్టరీ ఒకటి నాశనమై పోయింది. అయినప్పటికీ శత్రువులపై పగ సాధించవచ్చు. గూఢచారులను ఒకరిద్దరినే కాక ఒక వర్గాన్ని అంతటినీ పట్టుకోవచ్చు అనుకొన్నాడు.

మదలీనా అతన్ని ఓడించింది. తనను అనుమానించినట్లు వెంటనే కనిపెట్టింది. ఎప్పుడో యిటువంటి పరిస్థితి ఏర్పడగలదని ఆమె ముందుగానే ఊహించుకొని తగిన జాగ్రతలుచేసుకొన్నది. తనకు అపాయము వచ్చినా సంస్థకు అపాయము రాగూడదు.

తల్లిని చూడడానికని ఆమె సెలవు పెట్టింది. సెలవు తత్క్షణమే మంజూరు అయింది. ఆమె గూఢచార వర్గ రహస్య కూటము చేరుకొంటుంది అని వారు భావించి వెంట బడ్డారు. ఆమె మళ్ళీ వాళ్లను బోల్తా కొట్టించింది. ఆమె తిన్నగా తల్లి

దగ్గరకే వెళ్ళింది. తల్లి వార్ధక్యదశ కారణంగా ఉద్యోగానికి రాజీనామా యిచ్చింది.

ఆఖరుసారి తన జీతము తీసికోవడానికి వేతనాధికారి దగ్గరకు వెళ్ళింది. అతడు ఆమెకు చెందవలసిన డబ్బు చేతికివ్వగానే ఆమె అందరిముందర జాగ్రత్తగా లెక్కపెట్టి

"ఏమండీ ! మీరు లెక్కలో పొరపాటు చేశారు. దీనిలో పది మార్కులు తక్కువ" అన్నది.

"తక్కువేమిటీ ! నేనే స్వయంగా లెక్కపెట్టి యిచ్చాను. మళ్ళీ చూచుకో" అన్నాడు.

"అలాగునా?" అని ఆమె మళ్ళీ డబ్బంతా లెక్కపెట్టి "క్షమించండి-నాదే పొరబాటు-మళ్ళీ ఎప్పటికీ యిటువంటిది చేయను" అని ఆమె వెళ్ళిపోయింది.

ఆ వేతనాధికారి వెంటనే తన ముఖ్యానుచర వర్గంలో మంచి ప్రతిభా ఉపజ్ఞలు కలిగిన మదలీనా అపాయములో పడినదని గ్రహించాడు. చాలా విచారపడ్డాడు. కాని సంస్థను చెక్కుచెదర నీయకూడదు. గూఢచారి అపాయములో చిక్కితే వాడిగతి వాడిదే. నా అనేవారు ఎవరూ ఉండరు.

గెస్టపోవారు మదలీనాను వదలిపెట్టి ఊరుకోలేదు. ఆమెను కనిపెడుతూనే ఉన్నారు. వెంబడించి వెంబడించి విసుగుపుట్టి కడకు ఆమెను జబర్దస్తీగా అరెస్టు చేశారు. అప్పటికి కొన్నిమాసాలనుంచి ఆమె ఏమీపని చేసిన పాపాన పోలేదు.

ఆమెకు ఎన్నో ఆశలుపెట్టి సంగతులు తెలిసికొందామని ప్రయత్నించారు. అవన్నీ వ్యర్థములైనవి. ఆమెను ఎన్నో విధాల బాధించారు. బాధ మూలకంగానైనా ఆమె రహ

స్యాలు చెప్పుతుందేమోనని ఆశపడ్డారు. వారు పెట్టిన బాధ లన్నీ సహించింది. కాని ఏమీ చెప్పలేదు. ఇప్పుడుకూడా ఆమెదే పైచేయి అయింది.

ఒక రోజున తెల్లవారేసరికి ఆమె శవము కిటికీకి కట్టిన ఉచ్చుత్రాటిలో నుంచి వేలాడుతున్నది. తన గుడ్డలన్నింటినీ చించి త్రాడుగా పేనుకొని స్వయంగా ఆమె మెడకు ఉరి బిగించుకొని చచ్చిపోయింది.

ఆమె ఏ సంస్థలో పని చేసిందో అది యిప్పటికీ సజీవం గానే ఉన్నది.

# 10

పేరాచూటు తాళ్లు బిగబట్టినందువల్లనూ పతనవేగం మందగించినందువల్లనూ సార్జంటు ఆండ్రూసుకు కొంచెము స్థాయి చిక్కింది. దెబ్బతిన్న విమానంలో అతడు తోకవైపున Gunner గా ఉన్నాడు కాబట్టి Turret లో గుండా తప్పించు కొని బయటికి ఉఱకవలసి వచ్చింది. అరనిమిషము గడిచిందో లేదో అప్పుడే మంటలు బయలుదేరి విమానాన్ని ఆక్రమించు కొని అతనిమీదికి వచ్చినవి. రెండుమూడు ఊపులతో ప్రాణా లకు తెగించి విమానములోనుంచి బయటికి దుమికాడు. భగ్గు భగ్గుమని మంటలతో పల్లటీలుకొడుతూ దారము తెగిన గాలి పటమువలె విమానము భూమిమీదికి పడుతూన్నది. ఆండ్రూ సుకు సంతృప్తి ఏమిటంటే-తమ విమానము దెబ్బతినడానికి పూర్వమే తాము తలచుకొన్న లక్ష్యాలమీద దెబ్బతీసి కార్యాన్ని సాధించినామని. తమతోటి విమానాలు రెండు

మూడు మైళ్ళదూరంలో ఉండవచ్చు. వేగంగాపోయే విమానాలకు ముప్పయి క్షణాలు అంటే చాలా దూరములో ఉన్నారన్నమాట.

క్రింది భూమి మీద లంకాదహనము జరుగుతూ ఉన్నది. ఫర్లాంగుల పర్యంతము ఎత్తైన భవనాలనుండి మంటలు పొగలు భయంకరంగా వ్యాపిస్తూ ఉన్నవి. R. A. F. వారు బెర్లిను మీద జరిగించిన పెద్ద విమానదాడులలో అది ఒకటి. మంటల వెలుగు కొన్ని మైళ్ళదాకా వ్యాపిస్తూ ఉన్నది.

ఆండ్రూసు మంటలతో కూలిపోతూన్న విమానములోనించి తప్పించుకో గలిగాడు. ఒక పెద్ద ప్రమాదాన్ని తప్పించుకొని గండం గడిచిందనుకొంటే అంతకంటే యింకొకటి యెదురౌతున్నది. కింద ఎక్కడచూచినా మంటలు పొగలు అగ్నిగోళములాగా ఉన్నది. పేరాచూటుసాయంతో భూమిమీదికి దిగుతూన్నవాడు ఆ ప్రదేశమంతటా వ్యాపిస్తూన్న ఆ మంటల మధ్యలోపడితే ఏమికావాలి? తాను అప్పుడు చేయుగలిగినదేమీ తోచలేదు. కాని అతడు ధైర్యముమాత్రము విడువలేదు. అప్పుడు పడమరముఖంగా బలమైనగాలి వీస్తూఉన్నది. పేరాచూటు తాళ్లను గట్టిగా అదిమిపట్టుకొని దానిని గాలికి వాలుగా తిప్పుకొన్నాడు. పేరాచూటు కడుపునిండా గాలి పోసుకొన్నది. వాయుబలంవల్ల దాని గమనములో కొంచెము నిరోధమూ మార్పూ కలిగినవి.

విమానదాడి యింకా జరుగుతూనే ఉన్నది. క్రింది నుంచి మబ్బులలోకి కొన్నివందల సెర్చిలైట్లనులేసి విమానాల కోసము ఆకాశాన్నంతా గాలిస్తూ ఉన్నారు. బ్రహ్మాండమంతా ఒక్కసారి[illegible]ద్దలయ్యేటట్లుగా భీషణధ్వనులతో

బాంబులు పడుతూన్నవి. అయినప్పటికి అందూౌను దిగడానికే నిశ్చయించుకొన్నాడు గాలివీచే లక్షణాన్నిబట్టిచూస్తే మంట లున్నచోటికి దూరంగానే భూమిమీద వాలవచ్చు. మంటలు లేకపోతే మాత్రమేమి? నగరంలో యిండ్లమధ్యలో వాలడ మంటే చాలా ప్రాణాపాయకరము. ఏయింటికి కొట్టుకున్నా ఏ కాలో విరిగిపోతుంది.

అతనికీ యుద్ధానికీ ఋణము తీరినట్లే-ఇది తన పద కొండోదాడి. దీనిని ముగించుకొని యింటికి చేరుదా మను కొన్నాడు. కాని దైవము అనుకూలించలేదు. ఇక తాను యుద్ధఖైదీగా శత్రువులచేతికి చిక్కితే ఏమిగతి అవుతుందో ?

భూమిని సమీ పిస్తూన్నాడు. తానుదిగబోయే చోట మంటలు లేవుకాని వాటివెలుగుబాగా ప్రసరిస్తూన్నది. ఏకాం డంగా మంటలు లేనప్పటికీ చుట్టుపక్కల యిండ్లు ఒకొక్కటీ అక్కడక్కడ కాలుతూనేయున్నవి. తీరా యింతగా ప్రయ త్నించి ఆఖరుకు ఆమంటలో ఎక్కడైనా పడతానేమోఅని అతనికి చాలా భయమువేసింది.

చివరకు ఆతని పాదములు భూమిమీద వాలినవి. దైవానుగ్రహంవల్ల అతడు బెర్లినునగరంలో నడుపీధిలో పడ్డాడు. అతడు కాళ్లు నిలువదొక్కుకొని వెంటనే పేరాచూటు పట్టు వదలించుకొన్నాడు. అది గాలికి కొట్టుకొనిపోయి మండు తూన్న యింటిమీదపడ్డది.

అతడు నడుపీధిలో నిలువబడ్డాడు. శతృవులకు వశము కావడముతప్పితే యింక తాను చేయతగినపని యేమీలేదు. తన చుట్టుపక్కలంతా కలయదిరిగి చూశాడు. ఎవ్వరూ కనబడలేదు. అగ్నిమాపకదళము వారి దృష్టిఅంతా మండు

తూన్న భవనాలమీాద కేంద్రీకృతమై ఉన్నది. అక్కడక్కడ మండే చిన్నచిన్న యిండ్లను గురించి తలుచుకొనే వారేలేరు.

ఆండ్రూసు ఒక్కడే ఉన్నాడు. వైమానిక చిహ్నాలైన తన దుస్తులను తీసి పారవేశాడు. షర్టుమీాదివులనుబనియను ట్రౌజరు మాత్రము ఉంచుకొన్నాడు. విమానదాడులలో తప్పించుకొనేవాడి దుస్తులవైఖరి అంతకంటె భిన్నంగా ఏలా గుంటుంది? కాని అతని ట్రౌజరు మాత్రము R. A. F. వారి నీలిరంగులో ఉన్నది. కాని ట్రౌజరును అంతగా పరిశీలించే వారెవరు ?

వైమానిక చిహ్నాలను వస్త్రాలనుదీసి మంటలలో పార వేశాడు. తాను శత్రువులచేతికి చిక్కకుండా తప్పించుకోవా లంటే అవేవీ తనదగ్గర ఉండకూడదు. అతనికి దగ్గరలో ఒక బాంబు కనపడ్డది. ఇంకా తాను ప్రమాదాలలోనే ఉన్నట్టు తెలుసుకొన్నాడు. ఇంతవరకు వచ్చినతరువాత చావడము చాలా తెలివితక్కువ. దగ్గరలో ఒక (Air Raid Shelter) రక్షణాశ్రయము ఉండవచ్చును.

అతడు వీధి వెంబడి నిమ్మళంగా నడవడము సాగించాడు. కొంతదూరము పోయినతరువాత మూతవేసిన ఒక నీలిరంగు దీపము కనబడ్డది. దానికిందనే ఒక రక్షణాశ్రయము ఉన్నది.

దాని ద్వారము చెంతకుపోయి తటపటాయించాడు. ఎవరైనా తనను పలకరిస్తే? తాను బడిలో యెప్పుడో చదువు కొన్న నాలుగు జర్మనుముక్కలూ యిప్పుడు అక్కరకు వస్తాయా ?

ఏమైనా కానీ అని లోనికి ప్రవేశించాడు. లోపల అంతా చీకటిగా ఉన్నది. అతడు ప్రవేశించడము ఎవరైనా

చూచియుండవచ్చును. కాని ఎవరూ మాటలాడలేదు. విమానదాడులు క్రమంగా ఆగిపోయినట్లు తెలుస్తున్నది. కాని ఎవ్వరూ కదలలేదు. దాడులలో శత్రువులు పడవేసిన యాక్షనుబాంబులు ఆలస్యంగా పేలుతూఉంటవి. అందుకని ఆశ్రయాలను వదలిపెట్టమని బిగులు వినబడేటంతవరకూ యెవరూ బైటికిరారు.

తెల తెల వారుతూన్నది. అందరికీ ప్రాణాలు కుదట బడ్డవి. ఆంద్రూసు తుళ్ళిపడ్డాడు. తనకు మూడుగజాల దూరంలో యిద్దరు యువతులు మాటలాడుకొంటున్నారు.

"ఇప్పుడు బైటికి సురక్షితంగా వెళ్లవచ్చుననుకొం టాను" అన్నది ఒకతె.

"అవును పోదాము. యింటికిపోయి కాసేపు నిద్రపో వాలి" అన్నది రెండో యువతి.

వారు ఫ్రెంచి భాషలో మాటలాడుకోవడము వినేటప్ప టికి ఆంద్రూసుకు ధైర్యము కలిగింది. అతడు కూడా వారిని వెంబడించి ఆశ్రయంలోనుంచి బయటికి వచ్చాడు. విదేశీ యులు జర్మనీలోకి అనేకులు వచ్చారు. వారిలో బ్రిటీషువారి స్నేహితులు కూడా చాలామంది వున్నారు. ఆశ్రయంలోనుంచి బైటికివచ్చిన ఏ పదిమందో తప్పితే వీధియావత్తూ నిర్మాను ష్యంగా ఉన్నది. తాటస్థికంగా ఆయువతుల ప్రక్కగానే నడిచిపోతూండడము ఆండ్రూసుకు ఒక కష్టమైన పనికాదు.

"మీరు ఫ్రెంచివారా?" యని ఆంద్రూసు వాళ్లను అడిగాడు. అతనికి ఫ్రెంచిభాష జర్మనీభాషకంటే బాగావచ్చు.

"అవును" అనివాళ్ళు ఆండ్రూసువంక అనుమానంతో చూశారు.

"నేను బ్రిటీషు వైమానికుణ్ణి. రాత్రి నావిమానము దెబ్బతిని కాలిపోయింది. ఆ పాళంగా కిందికి దూకాను. నాకు కొంచెము సాయము చేస్తారా?" అని వినయంగా అడిగాడు

వాళ్ళకు అనుమానము ఇంకా జాస్తీ అయింది గెస్టపో వారు యిటువంటి పన్నాగాలు అప్పుడప్పుడుపన్ని సహాయం చేయబూనుకొన్న వాళ్ళను పట్టుకుపోతూంటారు. అట్లా నడుస్తూనే వాళ్లు ఆంద్రూసును బాగాపరిశీలించారు. రిలో ఒకతె అతని ట్రౌజరును చూసింది. స్నేహితురాలి చెవిలో "అతడు చెప్పింది నిజమే" అని ట్రౌజరును చూపించింది తరువాత ఆమె ఆంద్రూసునుద్దేశించి "నీవు మాతో రావద్దు. కొంచెము దూరంగా మమ్మల్ని వెంబడించు" అని నిమ్మళంగా చెప్పింది ఆంద్రూసు వెనక్కుతగ్గాడు. ఆ వీధి చివర వరకు వాళ్లను వెంబడించాడు. వాళ్లు ఒక యింట్లోకి ప్రవేశించారు అతడు కూడా లోపలికి వెళ్లాడు నడవఅంతా చీకటిగాఉంది. ఆ యువతులలో ఒకతె అతని చేయి పుచ్చుకొని మేడ ది గదిలోకి తీసుకొని పోయింది.

"నీవు నిజంగా బ్రిటీషు వైమానికుడవని యిప్పుడు రుజువు చేసుకో" అని ఆమె అన్నది.

అదృష్టవశాత్తు ఆంద్రూసు ఆపని సులభంగానే చేయగలిగాడు. అతని కాగితాలు ఇంకా షర్టు జేబులోనే ఉన్నవి. వాటినితీసి పారవేయలేదు. ఆయువతుల అనుమానాలన్నీ శాంతంగా పటాపంచలై పోయినవి. కాఫీ తయారుచేస్తూ అతన్ని ఎన్నో సంగతులు అడిగారు. వాళ్లకు యిటువంటి సంఘటన యెప్పుడూ తటస్థపడలేదు. వాళ్ళుతప్పకుండా తనకు సహాయము చేస్తారని ఆంద్రూసుకు బాగా నమ్మకము కలిగింది. అతని దుస్తుల విషయమేవాళ్ళు ఆందోళన పడుతున్నారు.

"నీవు ఆ బ్రొజరును విడిచి పారవేయాలి. అది నీ ప్రాణానికే ఉపద్రవము తెచ్చిపెడుతుంది. నీకు మరొక బ్రొజరు తెచ్చిపెడతాములే" అన్నారు.

వాళ్లు అన్ని విషయాలు చాలా శ్రద్ధగా ఆలోచిస్తున్నారు. వాళ్లు పనిలోకి పోవడానికి ఎందుకు తొందరపడడము లేదా యని ఆంద్రూసు వితర్కించుకొన్నాడు. విమాన దాడి తీవ్రంగా జరిగినరోజున పనులలోకి ఆలస్యంగా పోవచ్చునేమో యని సమాధాన పరచుకొన్నాడు.

ఒకతె బజారు నుంచి కావలసిన వస్తువులు తీసుకురావడానికి వెళ్లింది. రెండో యువతి ఆంద్రూసుతో మాటలాడాలని చాలా సరదా పడుతూన్నది. కాని అతడు అలసి ఉండడము గమనించింది.

"నీవు ఇక్కడ సురక్షితంగా పండుకోవచ్చు." అని అతణ్ణి ఒక పడకగదిలోకి తీసుకుపోయి చూపించింది.

"నీవు ఇక్కడనే వుంటావా?" అని అడిగాడు

"ఆ. మేము పగటిపూట పని చేయము" అన్నది.

ఆసమయము ఎంతటి ఉద్వేగంతో కూడియున్నప్పటికి బాగా అలసిపోవడంవల్ల ఆండ్రూసుకు వెంటనే నిద్రపట్టింది. ఆతడు బాగా నిద్రపోయినాడు. నిద్రలేచేసరికి భోజనము సిద్ధంగా ఉన్నది. అతడు వెంటనే బజారునుంచి తెచ్చిన మామూలు బ్రొజరు తొడుక్కున్నాడు.

తల వాకిలి దగ్గర గంట చప్పుడైంది. ఆయువతులు అదిరిపడ్డారు.

"ఎవరు వారు? గెస్టపో అధికారులా?" యని అడిగాడు.

"కాదు. మరేమీ ఫర్వాలేదు. నీవు మాత్రము

దాక్కొని ఉండాలి. పడకగదుల్లోగాదు. ఇదిగో ఇక్కడ యీ అలమర వెనుక కూర్చోవాలి. చాలా యిరుకుగా యిబ్బందిగానే ఉంటుంది. కాని యిది ఒక్కటే అనుకూలమైన చోటు. తప్పదుమరి'' అని వారిలో ఒకతె ఆగదిలో ఒక పెద్ద అలమారకు గోడకుమధ్య ఉన్న సందులోకి ఆండ్రూసును నెట్టింది. ఆండ్రూసు గప్ చిప్‌గా దూరాడు. గాలి ఆడుతూనే ఉన్నది. ఆమూల ఒదిగి కూచుంటే ఏమి యిబ్బంది లేదన్నాడు. బైట పడితే ప్రాణాలు పోయే స్థితిలో ఉన్నవాడు ఇంకా ఏమంటాడు?

వారిలో ఒకతె పడక గదిలోకి వెళ్లింది. రెండో యువతి కిందికిపోయి తలుపు తీసింది. కొన్ని నిముషాలకు పడక గదిలో జరిగే సంభాషణ ఆండ్రూసుకు బాగా వినవచ్చింది. అతడు చలించిపోయినాడు.

అరగంట తరువాత పడకగది తలుపులు తెరచినధ్వని వినబడ్డది. వారిలో ఒక యువతి ఆండ్రూసు దగ్గరకు వచ్చి ధిక్కారంగా నిలువబడ్డది. ఆమె ప్రక్కన రెండవ ఆమె కూడా వచ్చింది.

''చూశావా మాసంగతి!'' అని మొదటి ఆమె అన్నది.

''మేము ఏలాగో బతికాలి. నీకు తెలుసా మేము మార్సీలీసులో మలమల మాడిపోయినాము. ఏదో విధాన బ్రదుకు తెరువు చూచుకోవాలిగదా!'' అని రెండో ఆమె అన్నది.

''మీరు ఏమీ భయపడకండి. మీ ప్రవర్తనను గురించి చర్చించడానికి నాకేమీ అర్హతలేదు. నేను తప్పించుకొని పోవడానికి మీరు సాయము చేస్తున్నారు. అదే నాకు కావలసినది.'' అని ఆండ్రూసు అన్నాడు.

"అవును అందుకోసమే యీ ప్రయత్నాలన్నీ. నిన్ను సెటిల్‌మెంటుకు చేరుస్తాము. అక్కడ మాకొక స్నేహితురాలు ఉన్నది. ఆమె–"

ఇంతలోనే మళ్ళీ వాకిలి దగ్గర గంటచప్పుడైంది. అందర్నీసు మళ్ళీ గోడ సందులోకి దూరాడు. ఆ సాయంకాల మంతా అదే విధంగా గడచి పోయింది. వ్యాపారము బాగానే సాగింది. ఫ్రెంచి యువతులు కాముకలను కవుసేస్తూగా నిర్వహిస్తారు. జర్మనీ దేశీయులు వాళ్లకు దాసోహమంటారు.

ఆండ్రూసు బైటికి వచ్చేటప్పటికి అర్థరాత్రి కావచ్చింది వీథులలో పోలీసువారి కాపలా ప్రారంభమైంది.

వారిలో ఒకతె ఆదుర్దాగా ఆండ్రూసును సమీపించి యిట్లా అన్నది.

"మేము ఒక ఉపాయాన్ని ఆలోచించాము. మాకు తెలిసిన రైల్వే ఉద్యోగి ఒకడున్నాడు. అతడు మాకు కావలసిన పనులన్నీ చేసిపెడుతూ ఉంటాడు. పర్మిటు లేకుండా యిదివరకు మా స్నేహితురాలొకతెను తీసుకొని వెళ్లాడు. ఆమె ప్రయాణానికి పర్మిటు దొరకలేదు. నీవు ఇంగ్లీషు వాడివని అతనికి తెలియ కూడదు. నీవు ఫ్రెంచి వాలంటీరువనీ సెటిల్‌మెంటులో ఉన్న ప్రియురాలిని జూడడానికి వెళ్లుతున్నావని చెప్పాలి. అతనితో రేపు మాట్లాడి విషయాలన్నీ నిర్ణయము చేస్తాము".

డెబ్బదిరెండు గంటల కాలము ఆండ్రూసు అదే విధంగా బీరువా సందులో గడుపవలసి వచ్చింది. అతడు దాక్కొని ఉంటే ఆ యువతుల కోసము వచ్చేవారు వస్తూనే ఉన్నారు. నాలుగోనాటి రాత్రి ఒకతె ఆండ్రూసును రహస్యంగా ఒక రైల్వే సైడింగు దగ్గరకు తీసుకొనివెళ్లింది. యీని

ఘారము వేసుకొన్న గార్డు ఒకడు వీరి కోసము అక్కడ కని పెట్టుకొని ఉన్నాడు.

"ఇతడే మా స్నేహితుడు" అని ఆమె చెప్పి ఆండ్రూసును ఒప్పగించింది.

"దారిలో తినడానికి ఏమైనా రొట్టెలు కట్టి యిచ్చావా? ప్రయాణము కొన్ని రోజులు పడుతుందేమో!" అని ఆ గార్డు అన్నాడు,

"కట్టియిచ్చాను"

"ఇదిగో! యీ గూడ్సుపెట్టెలోకి యెక్కు. తాళము వేస్తాను. నీవు నిశ్శబ్దంగా ఉండాలి. మధ్య మధ్య కను క్కొంటూ ఉంటాను. నేను వచ్చి పిలిచేటంతవరకూ నీవు కిక్కురు మనకూడదు. తెలిసిందా?" అనిగార్డు ఆండ్రూసుతో అన్నాడు.

ఆండ్రూసు వందనాలు చెప్పడం సాగించాడు. ఆ జర్మను గార్డు ఒక పెద్ద నవ్వు నవ్వి ఆండ్రూసు మాటలను ఆటంకపరిచాడు.

"నీవేమీ బాధపడబోకు. నేనీపనిని పుణ్యానికేమీ చేయడము లేదు. ఇది చాలా అపాయకరమైనది, మేరీ నన్ను బాగా సంతోషపెట్టవలసి ఉంటుంది" అని జర్మను గార్డు అన్నాడు.

"తప్పకుండా సంతోషపెడతాను. సీలియాను తీసి కొని వెళ్లినప్పుడు నిన్ను తృప్తిపరచలేదూ?" అని ఆ యువతి అన్నది.

"స్త్రీకంటె పురుషుడు మరీ కష్టము."

"నాకు తెలుసు. నీకష్టము వృథాగా పోనీయను. తగిన ప్రతి ఫలమే నీకు ముట్టుతుంది."

గార్డు సంతృప్తిపడ్డాడు. ఆ చీకటిలో ఆండ్రూసు మేరీ చేతిని పట్టుకొని ముద్దాడి కృతజ్ఞతా పూర్వకంగా ఆమెను చాలా కొనియాడాడు. ఇంటిదగ్గర బయలుదేరేటప్పుడే ఆ యువతులిద్దరి త్యాగము పరోపకారములను గురించి శ్లాఘిస్తూ తన కృతజ్ఞతను తెలియజేశాడు. జీవితాంతమువరకు వారు చేసిన మేలును మరచిపోనన్నాడు.

ఆండ్రూసు బండిలోకి యెక్కాడు. గార్డు తలుపులు మూసి తాళము వేశాడు. రైలు కదిలేటప్పటికి రెండు గంటల కాలము గడచిపోయింది. తరువాత కొంతసేపు కొన్ని పెట్టెలు వదలిపెట్టడము మరి కొన్నిటిని తగిలించుకోవడము జరిగింది. చివరకు స్టేషను వదలిపెట్టి ప్రయాణము సాగించింది.

ఆ విధంగా ప్రయాణము చేసినవాడు కాలాన్ని సరిగా తెలుసుకోలేడు. పగటిపూట సందుల్లోగుండా వెలుతురు కనబడుతుంది. రాత్రిపూట గాఢాంధకారము. అనేక పర్యాయాలు ఈ గూడ్సుబండిని సైడింగ్‌లోకి నెట్టి గంటలకొలబడి పడవేసి పెట్టితే ఇతర బండ్లు పక్కగుండా పోతూండేవి. ఆబండి గమ్యస్థానము చేరుకొనేటప్పటికి ఇంకా చాలా పొద్దు ఉన్నది. చీకటి పడేవరకూ ఆండ్రూసు కనిపెట్టుకొని ఉన్నాడు. బాగా చీకటి పడ్డతరువాత గార్డువచ్చి తలుపు తెరిచాడు.

"సెట్రిన్ చేరుకొన్నాము. నీవు దిగి యీ రైలుపట్టాల వెంబడే గూడ్సుస్టేషన్ ప్రక్కగుండాపోయి రోడ్డును కలుసుకో. ఎడమవైపు రెండోవీధి నీవు పోవలసినది." అనిగార్డు ఆండ్రూసు చెవిలో చెప్పాడు.

సీలియాకు ముందుగానే ఆంద్రూసు సమాచారము తెలియ జేశారు. నెంబరు చూచుకొని ఆంద్రూసు తలుపు తట్టగానే సీలియావచ్చి తలుపు తీసింది.

సీలియాను చూడగానే ఆంద్రూసు దిగ్భ్రాంతుడైనాడు. బెర్లినులో ఉన్న యువతులిద్దరిదీ కృతకసౌందర్యము. సీలియాది ఐన్మాతః జగన్మోహనాకారము.

"నీవేనా ఆ ఆంగ్లేయుడవు?"

"అవును."

"త్వరగా లోపలికరా"

ఆమెగది చాలాచిన్నది. అయినప్పటికి చాలా శుభ్రంగాను ముచ్చటగానూ ఉన్నది. ఆమె వెంటనే కాఫీ తయారుచేసి యిచ్చింది. ఆండ్రూసు దృక్కులు సీలియా మీదనే లగ్నమైనవి. ఆమె ఒక లిల్లీపుష్పమువలె ఉన్నది.

"నీవు స్వీడన్ చేరుకొంటావా?"

"అవును జర్మనీ దాటి ఎక్కడికైనా సరే!"

"నేను ఏర్పాటు చేయగలను. నావికులలో నాకు చాలా మంది తెలిసినవారున్నారు. స్వీడెను పోయే స్టీమరు దొరకడానికి చాలా ఆలస్యమవుతుంది."

రోజులు గడచినవి. సీలియా చక్కనిదే కాకుండా అమిత చాకచక్యముకలది. ఆండ్రూసుకు ఆమె మీద మితి మీరిన మమకారము కలిగింది. ఒకనాటిరాత్రి ఆమెను ఈ విధంగా సూటిగా ప్రశ్నించాడు.

"ఇంటువంటి జీవితము నీవెందుకుగడపాలి?"

"నీకు మాటలతో చెప్పితే అర్థముకాదు, ఇటు ప్రాణమా అటు మృత్యువా అనే సమస్య నిన్ను వెన్నాడి

ఉండదు. నీవు ఒక్కడవుగా ఉన్నప్పుడు తేలికగానే ఉంటుంది. ఈ సమస్య నీపై అధారపడియున్న కుటుంబ పోషణ విషయం లోకి వచ్చినప్పుడు కాని దాని జటిలత గోచరించదు.

మా అన్నయ్య జర్మనీలో ఖైదీగా ఉన్నాడు. మా అమ్మ చాలా పేదరాలు."

"మరి—నీవు ఏ ఫ్యాక్టరీలోనో మరెక్కడనో పని చేయ కూడదూ?"

"అవును చేయవచ్చును. నే నీపనిచేస్తే మా అమ్మకు ఎక్కువ రేషన్లుఇస్తామన్నారు. వాళ్లకు చాలామంది స్త్రీలు అవసరంగా కావలసి వచ్చారు. నేనీవృత్తి అవలంబించినట్లయితే మా అన్నయ్యను కూడా ఒక సంవత్సరము కాగానే విడిచి పెడతామన్నారు."

"ఇప్పటికి ఎన్నాళ్లయింది?"

"పది నెలలు"

"నాకోసమని అపాయాన్ని నెత్తిమీదికి తెచ్చిపెట్టు కొంటావా ?"

"అది వేరే సంగతి. మా అన్నయ్య మాత్రము మీకు చేయవలసిన సహాయానికి వెనుదీస్తాడా?"

ఆ మనస్తత్వము ఫ్రెంచివారికి బాగా బోధపడుతుంది. ఆంధ్రదాసుకు అర్థము కాలేదు. కాని సీలియాస్థితి అతనికి చాలా జాలి కలిగించింది. లలిత లవలీలతా సదృశమైన ఆమె శరీరము దుర్గతి పాలవుతూన్నది. ఆండ్రూసు ఆలోచనలో మునిగి పోయినాడు ఆమె ముఖసౌందర్యము, అవయవశోభ, జమిలి ముక్కాలి బారులవలె ఉన్న మనోహర నీలాలక శ్రేణి, ధవళ దాడిమీ బీజములుపోలిన రదనపంక్తి. విశాలమైన నల్లని

నయనాలనుండి వెలువడే తళతళలు, వీణా నాదమువంటి కంఠ స్వరము ఒకటేమిటి - సర్వాంగకములు తీర్చిదిద్దినట్లుగా సంపూర్ణ శోభతో మహోజ్వలంగా తేజరిల్లుతున్న ఆమె విగ్రహము చూచినకొద్దీ చూడబుద్ధి పుట్టుతున్నది. ఏ మనిష్యుడు తాకకుండా - తాకితే ఏమి చెడిపోతుందో. ఏమి అపవిత్రత ఆపాదిస్తుందో అని దూరంగా పెట్టుకొని దేవతా మూర్తివలె ఆరాధించదగిన ఆమెకు - ఛీ - ఛీ ఇటువంటి హేయమైన వృత్తికి పాలుబడవలసిన గతిపట్టింది విధి ఎంత నిర్దాక్షిణ్యము కలది! ఈ యుద్ధాలు మానవులను పశువులకంటె హీనస్థితి లోకి దింపుతున్నవి. సంఘానికి బలికాక పూర్వము ఈ సౌందర్యము ఏవిధంగా ఉన్నదో! వయోరూపాలు విద్యా సంస్కారణలు గలిగిన ఆండూృసు ఇవన్నీ తలచుకొంటూ కరిగి పోయినాడు.

ఒకనాటి రాత్రి ఆండూృసుతో ఆమె ఇట్లా అన్నది.

"ఈవేళ స్వీడెనునుంచి ఒక స్టీమరు వచ్చింది. నాకోసము ఎవరో ఒకరు తప్పకుండా వస్తారు. నీవు ప్రయాణానికి సిద్ధపడు".

అయిదు గంటలు దాటిన తరువాత ఆమె వేసుకొన్న పథకంలో మరొక మెట్టు పూర్తిచేసి ఆండూృసుతో చెప్పింది.

"గురువారంనాడు స్టీమరు బయలుదేరుతుంది. నిన్ను దొంగతనంగా స్టీమరులోకి ఎక్కిస్తారు. చాలా అపాయంతో కూడినపని కాబట్టి నేను ఆస్టీమరు కెప్టెన్ని సంపూర్ణంగావశం చేసుకోవాలి"

ఉప్పొంగిపోతూన్న ఆండూృసు మనస్సు ఒక్కసారిగా పొరలిపోయింది "సీలియా! నాజీవితాన్ని నీ పాదాలదగ్గర ధార పోస్తాను. స్వీకరించు" అని ఆమె ముందు మోకరిల్లాడు.

సీలియా అతన్ని పట్టుకొని లేవనెత్తింది.

"ఆండ్రూస్! నాకు ఈ జన్మపాడయిపోయింది. ఇప్పుడు విచారించి యిక లాభంలేదు". ఆమె కంఠంలో గద్గదిక కన్నులలో బాష్పము లొక్కసారిగానే అంకురించినవి హృదయములో ఉన్న సంక్షోభము అడచుకోలేక ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది. నాలుగోనాటి రాత్రి అతడు వంట యింటిలో దాక్కొని ఉండవలసివచ్చింది. ఆ రాత్రి సీలియా స్వీడెను స్టీమరు కెప్టెనుతో విలాసంగా వెళ్ళిపోయింది. అర్ధరాత్రివేళ ఆమె ఆండ్రూసు కోసము వచ్చింది. అప్పుడు ఆమె ఒంటి మీద సిల్కు మస్లిను గౌను తప్ప మరొకటి ఏమీలేదు. ఆమె పృథుల పయోధరములు నితంబబింబములు రంభాస్తంభములవంటి యూరువుల యొక్క నైగనిగ్యములు మధుర మోహనకరంగా భాసిల్లుతూన్నవి.

''ఇక సెలవు'' అన్నది.

ఆండ్రూసు ఆమెను గాఢంగా కౌగలించుకొని ముద్దు పెట్టుకొన్నాడు. ఆమెకూడా పట్టరాని ఉద్వేగంతో ఆండ్రూసును పెనవేసుకొన్నది.

''నేను వ్యభిచారిణిని నామీద నీకెందుకు ఇంతప్రేమ?'' అన్నది.

''సీలియా! స్వర్గంలో దేవతలుంటారని అంటారు. నా మనస్సుకు నీవు ఒక దేవతవు. నీతోకూడినదే నాకు స్వర్గము మన మిద్దరము వెళ్ళిపోదాము రానా వెంబడి' అని ప్రార్థించాడు.

సీరియా ఆండ్రూసు కౌగిలినుండి విడిపించుకొన్నది.

''నేను రాను. నాకింకా రెండు నెలలు గడువున్నది.'' అని వెళ్ళిపోయింది.

మొదటి భాగము సంపూర్ణము.